కోపల్లి వేంకటరమణారావుగారి

సాంఘిక నాటకరత్నాలు

పెట్టమారి మగడు వెల రు 1—0—0

ఇల్లరికపుటల్లుళ్ళ యిబ్బందులు నవనాగరిక యువతీమణుల గగన కుసుమభావాలు, ఆలిమగల స్వతంత్ర పరతంత్రజీవనాలు, ఇంటి నౌకర్ల టొంకణాలు, వంటబ్రాహ్మణుల నర్తనపై రుధ్యాలు, దాసీల వలపుముచ్చట్లు, స్నేహితుల విధ్యుక్తధర్మాలు మున్నగు పలు విషయములు రసవంత ఘట్టాలతో అమర్చబడి తీర్చి కూర్చబడింది.

బలే పెళ్ళిళ్ళు వెల రు 1—0—0.

ఈ నాటకములో ముసలి పెళ్ళికొడుకుల ముచ్చట్లు, పడుచుభార్యల అగచాట్లు, అంటరానివాళ్ళ ఆపదలు, కళ్ళకు గట్టినట్లు చూపించి శృంగారకరుణ హాస్యరసత్రయాన్ని కుప్పించి ప్రేక్షకులు, చదువరులు, ఆహా యని తలలూపేటట్లు చిత్రింపబడ్డాయి. మీరు దీనివల్ల పెళ్ళిళ్ళ మజాలన్నీ తెలుసుకుంటూ రసఘటలో సందేహముతేరు.

భాగ్యరేఖ వెల రు 1—0—0

ఈ నాటకంలో పెద్దమనిషినని పేరెట్టుకొని ధర్మకార్యనిర్వహణ దీక్షాపరతంత్రుడనని డాబుచేస్తూన్న కృష్ణశాస్త్రి విపరీత జీవిత ఘట్టాలు, వరహాలనే కాఫీహోటలు సేవరు కట్టుకథ. సముద్రము ఉప్పూ అడవి ఉసిరికాయవలె కలిసి, ప్రణయసాగరంలో అల్లాడి, ధనాగమంతో ధర్మపత్రం స్థాపించిన మీనా ప్రభాకరుల గాథ ముగ్గడిగా నడిచింది. చదివితీరవలసిన నాటకరాజము.

గరల్ వైఫ్ వెల రు 1—0—0

ఈ గరల్ వైఫ్ నాటకంలో పలువిధ ఘట్టములు కుదిమట్టంగా నడిచాయి. సమర్తాడకుండా శోభనంచేసే మూఢులైన తలిదండ్రులకు బుద్ధి చెప్పి అల్లుళ్ళతో సరాగాలాడే అత్తలను చీవాట్లుపెట్టి మోసపు నేస్తగాండ్ర మాటలు విని చెడిపోయే బుద్ధిహీనులను మంచిత్రోవకు తిప్పి నీతినిలయ మనిపించుకునే నాటకమణి.

# మహారథి కర్ణ



(నాటకము)

రచయిత:

వేదాంత కవి



పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1946

 [ రు 1 – 8 – 0 ]

# ప్రకటన

నేను రచించిన ఈ "మహారథికర్ణ" అను నాటకాన్ని సినిమా వారుగాని, నాటక సమాజాలవాళ్ళుగాని మఱి ఏ యితరవ్యాపారస్థులుగాని నాలిఖితపూర్వకమైన అనుమతిలేనిదే దేనికీ ఉపకరించుకోకూడదు. ఏకపాత్రధారులుగాని, హరికథకులుగాని, రేడియో కంపెనీవారుగాని, ఫోను రికార్డు కంపెనీవారుగాని, నాలిఖితపూర్వకమైన అనుమతిలేనిదే యీనాటకంలో పదాలుగాని, పాటలుగాని, పద్యాలుగాని, ప్లాటుగాని ఉపయోగించుకోకూడదు. యాక్టర్సు ఎవ్వరూ దీనిలో కొత్తసరుకును చేర్చి ఆడకూడదు. ఈ నాప్రకటన అతిక్రమించి యీనాటకాన్ని ఎట్లా ఎక్కడ వాడకొన్ననూ నేను జరిపే సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

బెజవాడ
కవితాసంస్థానం
9 — 4 — 46

వేదాంతకవి
అను
వేదాంతం వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి
ఇ. జి. 14—1000—1946

# కాస్త

చెబుతా, కథంతా భారతంలోదేగాని మిగతా కల్పనంతా నావిచక్షణా దృష్టిలోది. ఈ నాటకాన్ని లోగడ, "పిచ్చమారాజు" అని ఎడ్వర్టైజుమెంటు చేశాం. కథావస్తువు భారతంలోది కాబట్టి పేరుమార్చి ఇందులో ప్రధానకథానాయకుడైన కర్ణుడిపేరుతో "మహారథికర్ణ" అని చేర్చాం.

ప్రస్తుత ప్రపంచంలో దుమ్ము దుమారాలు లేపుతున్న ఘట్టాలన్నీ యీనాటకంలో కళ్ళక్కట్టినట్లు కనపడతై. పురాతన భారతనాటకాలకి నిలబడి నిక్కచ్చిగా నిఖార్సైన సమాధానం ఇస్తుంది.

ఈ నాటకం నవ్యమానవసృష్టికోసం మహాభారతయుద్ధాల్ని నిద్రపోకుండా చేస్తుంది. అయినా రసికజనమనోభిరాములంతా ఒకమాటు చదివి చూడండి. మీకె తెలుస్తుంది. గజ్జగట్టి నాటకరంగానికెక్కిస్తుంది.

వేదాంతకవి.

లోకకంటకుఁడైన దుష్టుఁడూ కాదు, కోపిష్టియూ కాదు. అసలు నిజాన్ని కప్పిపెడుతున్న యీ మాయలోకంలో

ఉ. మోసముచేసి, ఘోరముగ భూప్రజలన్ దినుచున్న యీ దుర
భ్యాసపు మోసగాండ్రిల యథార్థము సెప్పెడి వారి నెల్ల దూ
ర్వాసుల ఉంచుచాటి, యిఁక వారికి శేమియు పుట్టకుండ స
న్న్యాసులఁ జేసి, యిమ్మెయి వసమ్ములకున్ దరిమించి రక్కటా!

సూతు—నిజంగా అంతే; మిత్రమా! ఋషిపుంగవులు కాఁబోలు వస్తున్నారు.

సూర్య—అవును. వీరే యథార్థవాదులైన దూర్వాసమహాఋషి పుంగవులు. వీరేమన్ననూ, ఏమడిగిననూ కోపగించుకోక, వస్తున్నారు. పదా. దర్శించుదాం.

(నిష్క్రమింతురు. తెరపడును)

---

2 వ ర ం గ ం : ఆశ్రమం.

[సూర్యుఁడూ సూతుఁడూ ఎదురుగా రాగా
శిష్యులతో దూర్వాసుఁడు ప్రవేశం]

సూతుడు, సూర్యుడు—స్వామీ! నమస్కారములు. (నమస్కరింతురు)

దూర్వా—ఎవరు మీరు ?

సూతు—వీరు జగద్బాంధవులు.

దూర్వా—నీవో, నీవూ జగద్బాంధవుడవే. నీవు మట్టుకు సామాన్యుడివా ? లేనిపోని కల్లబొల్లి మాటలు చెప్పి, అమాయకుల్ని కొట్టి తింటున్న యీ మాయాప్రపంచంలో జగద్బాంధవులు కానివా రెవరు ? అంతా జగద్బాంధవులే. ఇటువంటి భట్రాజు స్తోత్రవాచకాలతోనే ప్రతివాఁడూ కన్నూ మిన్నూ కానకుండా

నడుస్తున్నాడు. లోకాన్ని మోసగిస్తున్నాడు. అయితే ఎందు కొచ్చారిక్కడికి?

సూతు—తమ దర్శనార్థం వచ్చాం స్వామీ!

దూర్వా—ఎందుకూ మాదర్శనాలూ శాపనార్థాలూ బ్రతకలేకనా? ఎవ్వరికీ పనికిరాని జన్మలెత్తి యిట్లా అడవులపాలై వున్నవాళ్ల దర్శనా లెందుకు?

సూతు—న్యాయ నిదర్శనాలకు స్వామీ!

దూర్వా—న్యాయ నిదర్శనా లెందుకు? మీ కేమన్నా పిచ్చబట్టిందా? మీరు కూడా మా మాదిరి అడవులు బట్టి సన్యాసులై పోవటానికా? ఈయనేమిటి? ఇందాకట్నుంచీ యేమీమాట్లాడడు?

సూర్య—స్వామీ!. సమస్తైశ్వర్యాలమీదా రోతపుట్టి సమస్త సామ్రాజ్యభోగపిశాచాల్ని గోచిపాతకు బలియిచ్చుకొన్న తమ వంటి సర్వసంగపరిత్యాగ చక్రవర్తులముందు మేమేమి మాట్లాడ గలం?

దూర్వా—మాట్లాడలేకపోటం కాదు. ఇట్లా స్తోత్రవాచకాలతో మళ్లీ నోరెత్తి మాట్లాడనీకుండా చేయగలరు. అయితే, ఎందుకొచ్చారు?

సూర్య—స్వామీ!. తమవల్ల ప్రేమగురించి తెల్సుకొందామని వచ్చాం.

దూర్వా—అసలేమీ తెలియక యిట్లా అడవినిబడి పోతున్నవాడి కేం తెల్సు? మీపట్టణాలలో, మీనిరంకుశబ్రాహ్మణసామ్రాజ్య సంస్థానాలలో బాగా తెల్సిన పండితు లంతమంది అంతంత గ్రంథాలు వ్రాసి ప్రేమగురించి వుపన్యసించి చెబుతుంటే మీకు తెలియనప్పుడు ఇహ ఎందుకూ పనికిరాక సన్యాసులై పోయిన మావంటివాళ్లు చెబితే యేం తెలుస్తుంది?

సూర్యు—స్వామీ! ఈమాయాప్రపంచంలో ఈనిరంకుశ బ్రాహ్మణ సామ్రాజ్య సంస్థానాలలో తయారైన పండితులు వ్రాసిన గ్రంథాలు గురించి మీకేం చెప్పగలం.

చ. ధనమునుజూచి ప్రేమను విధాతృడు మోమున వ్రాసెనంచు భూ
జనులకు నచ్చఁజెప్పెడి నిశాచరపండితులెల్ల తాళిగై
కొని పసివాండ్రగొంతు కురికుచ్చులుపోసి కృపావిహీనులై
అనయము ధాత్రిపైన ప్రళయంబులులేపిరి యోగిపుంగవా.

దూర్వా—ఇంకా నీకెక్కడా ప్రేమోపాసన గురించి చెప్పినవారు కని పించనేలేదా?

సూర్యు—స్వామీ! ఈప్రేమోపాసనకోసం దేశదేశాలు తిరిగొస్తున్నా నాకెక్కడా పవిత్రమైన ప్రేమారాధనచేసే ప్రేమోపాసకులు కని పించలేదు. ఈనాఁటి ప్రేమకలాపాలు నన్ను తృప్తిపఱచలేదు.

దూర్వా—అయితే! నీపేరేమిటి?

సూర్యు—సూర్యుఁడు.

దూర్వా—అయితే ఇంత నీతీవ్రవాదాల్ని చూచి, నీవిప్లవకిరణాల్ని చూచి, యెవరైనా యీలోకంలో నిన్ను పిలుస్తున్నారా?

సూతు—లేదండిస్వామి! ఇతని రాకతో నావంటివాళ్ళకి యేదో చక్కని వెలుఁగువచ్చి బ్రతుకుతెరువులు కనిపిస్తున్నైగాని, పురాతన పురాణధర్మాలలో మురుగుతున్న యీబురదగుంటలూ డొంకలూ ఎండి కంటగించుకొంటున్నై.

దూర్వా—ఇతఁడెవఁడో గట్టివాఁడే. నీకితఁడెక్కడ దొరికాఁడు.

సూర్యు—నాస్నేహితుఁడండి.

దూర్వా—అయితే! నీకోరిక ప్రశంసనీయమైంది. ఇట్లాగే వివాహాదిరి ఈ పాపిష్టిలోకంలో వివాహధర్మాలేవీ గిట్టక, ఎవికిరాక వెనక నన్ను భోజరాజపుత్రి కుంతి, క్రొత్త ప్రేమోపదేశం చేయుమని

వేడింది. ఆకుంతికూడా నాల్గురోజుల క్రొకమాటు నాఆశ్రమాని కొస్తున్నది. ఇక మీవంటివాళ్ళ పవిత్రసంకల్పం నెఱవేరగల ప్రేమమార్గం చూపిస్తాను. కుంతీ, నీవూ కలిసి నేనుచూపించిన యీనవీన ప్రేమమార్గం బట్టి లోకకళ్యాణం చేయండి ఆమె కూడా యీవేళ వస్తుంది.

సూతు—(చూచి) వారేనేమండి భోజరాజపుత్రి.

దూర్వా—(చూచి) అవును. ఆమెగూడా సమయానికొస్తున్నది పదండి మాట్లాడివద్దాం. (నిష్క్రమింతురు తెరపడును.)

## ద్వితీయరంగము:

### ఆశ్రమము వసారా

[కుంతి ప్రవేశం అంతా కూర్చుందురు]

కుంతి—గురుపుంగవా! నమస్కారములు.

దూర్వా—అనుకొంటుండగానే వచ్చావు. కూర్చో, ఇవాళ నీవొకతెవే వస్తున్నావేమమ్మా? నీచెలికత్తెలేరి?

కుంతి—వాళ్లకి నాగోష్ఠి అర్థంకావటంలేదని రాలేదు.

దూర్వా—(నవ్వి) అవును. వాళ్లకి ప్రేమోపాసన అక్ఖర్లేదు. ఈ సనాతన మహిళాలోకంలో ప్రేమఅంటే అర్థంగాక పెళ్లనిచెబుతున్నారు. అటువంటివాళ్లకి ప్రేమకళాగోష్ఠి చెవికెక్కదు. ప్రేమకళోపాసన బుద్ధికి పట్టదు. చక్కని పూలమొక్కను జూచి, ప్రేమించి, దాని చక్కని పూలు శిరసావహించి దాని కమ్మని పరిమళాలు ఆఘ్రాణించి, ఆనందిస్తున్న హృదయాలలో ప్రేమ పుడుతుంది. ఇటువంటి కోమలసుకుమార సుందరలతా ప్రఫుల్లకుసుమాల్ని

పూస్తున్న మొక్కను ప్రతివారునూ ప్రేమించవచ్చును. దీనికి కఠిన శాసనశృంఖలాలు పనికిరావు. ఈ అమాయకసనాతన మహిళా మండలిమట్టుకు క్రూరనిరంకుశ శాసనశృంఖలాలు తగిలించుకొని, ప్రేమకు దూరమై కుటిలస్వభావాల్ని మోహించి క్రూరచిత్తుల్ని కని ఘోరనరకంలోబడి కొట్టుకొంటున్నారు. చక్కచక్కని సౌందర్యకిరణాల్ని విరజిమ్ముతూ పూస్తున్న పూల మొక్కల్ని చూచి కుర్రగాడ్పులు పులకరిస్తున్నప్పుడు మాధవుం డైన వసంతుడు కమ్మని కోకిలారావంతో పలకరిస్తున్నాడు. ఇటువంటి మనోహరబృందావనంలో దేవతలు పుడుతున్నారు గానీ, రాక్షసులు పుట్టడంలేదు. అంటే, పూలమొక్కలోవున్న అందాన్నీ, మకరందాన్నీ, మార్దవాన్నీ, సుకుమార పరి మాణాన్నీ అనుభవించి ఆనందిస్తున్న వానిహృదయంలో ప్రేమ పుట్టి పూలమొక్కను కాపాడటానికి దృఢమైన పట్టుదల పట్టిస్తుంది. ఇటువంటి మనోహరజీవితబృందావనంలో అమృత మూర్తులు జన్మించి లోకకళ్యాణం చేస్తారు. ఈడూజోడూ గల స్త్రీపురుషులు నవయౌవనసౌందర్యోపాసకులై, స్వేచ్ఛానంద కళాప్రపూర్ణులై పూలమొక్కలమాదిరి, పిల్లతెమ్మెరలమాదిరి కలిసిమెలిసి జీవించాలి. అప్పుడు లోకంలో శాంతిసౌఖ్య మార్గాలు కనిపిస్తై, వేదశాస్త్రాలు చాలా గొప్పవని, వాటిని గట్టిగా వల్లించి జల్లిస్తున్న పురోహితుల్ని వెంటపెట్టుకొని డెబ్భయేళ్ల ముసలవాడు పసిపిల్లమెడకి ముడిసివేసి ముడివేస్తే ప్రేమపుడుతున్నదో ప్రళయం పుడుతున్నదో చూచుకోండి. ప్రేమ బహు మృదువైన పుష్పంవంటిది. అంత సుకుమార ప్రేమకుసుమాన్ని, పట్టకార్లతో పట్టి, సుత్తిదెబ్బలతో అణచి

పెడదామని ప్రయత్నించేవాళ్ళ వల్ల ప్రపంచానికేం ప్రయోజనం లేదు.

ఉ. పెండ్లిమనుష్య లోకమున పెద్దపిశాచమువోలెమారి, మీ
కండ్లకు లెక్కలేని కషగండ్లను బెట్టుటలేద ? దేనికీ
పెండ్లిపెటాకులింక ? కడువేడుక పుట్టెడిప్రేమతోడ నే
య్యేండ్లు సుఖించుఁడయ్య ! జగమెల్ల నుతించెడి నూత్నజీవులై.

సూర్య—మహాత్మా ! ధన్యులం. మీ రిప్పు డుపదేశించిన ప్రేమోపాసన మా జన్మల్ని పవిత్రం చేస్తుంది.

ఉ. ప్రేమకుసాటియైన యిలువేల్పు మఱెక్కడలేదు, దానిచే
కోమలమైన సృష్టికలుగుఁ భయముల్ తొలఁగున్ మహాత్మ! యీ
ప్రేమకు జీవితమ్ము చిగిరించి మనోహరమైన తోటయై
భూమి సమస్తమున్ గరగిపోయును కోయిల చిన్నిగొంతులో.

దూర్వా—నాయనా ! ఆ ప్రేమారాధనకోసమే జన్మలెత్తుతున్నది. ప్రేమ సామ్రాజ్యంలో స్త్రీ పురుషులకు సమానమైన హక్కున్నది. ఈ ప్రేమ హక్కును స్త్రీ పురుషులిద్దరూ సమత్వ దృష్టితో సమానంగా అనుభవిస్తున్నప్పుడు స్వర్గతుల్యమైన జీవితాన్ని నిలపెట్టుకొంటారు. లేకుంటే మహారౌరవాదినరకంలో బడి కొట్టుకొంటారు.

కుంతి—మహాత్మా ! ధన్యులం.

ఉ. ఇంత స్వతంత్రజీవితము హీనముఁజేసి మనుష్యకోటి నే
డెంత దురంత కష్టముల కీడ్చెను జన్మను పెండ్లితోడ ? మే
మంత మహాత్మ ! మేలుకొని యీ బ్రతు కింక బహిష్కరించి ని
శ్చింతగఁ బ్రేమమార్గమున జేరి తరింతుము సంతసమ్ముగాన్.

దూర్వా—ఇంకా మీ రప్పుడు నిస్సందేహంగా ప్రపంచ కళ్యాణం చేస్తారు. ప్రేమదాంపత్య వల్లిక లిట్లా చిగిరించి నప్పుడు గాని జగత్కళ్యాణం జరగదు.

[సభాపతి ప్రవేశం]

సభా—(హడావుడిగా ప్రవేశం) మహాత్మా! మహాత్మా!

దూర్వా—ఏమిటయ్యా! హడావుడి?

సభా—లగ్నం మించిపోతుందండి.

దూర్వా—ఏం లగ్నమయ్యా?

సభా—పెళ్లి లగ్నమండి.

దూరా—అయితే అది ప్రేమాభిషేకమా? కట్నాభిషేకమా?

సభా—అదేమిటండి. కట్నాభిషేకమే లెండి.

దూర్వా—విన్నారా! జరుగబోయేది పెళ్లిలగ్నమట చూడబోయేది కట్నాభిషేకమట, అయితే దానికి మేం రాములెండి.

సభా—అట్లా అంటారేమిటండి?

కుంతి—అవును ప్రేమాభిషేకం లేనప్పుడు అది పెండ్లెట్లా అవుతుంది?

సభా—పెండ్లిగ్గూడా ప్రేమాభిషేకాలు పట్టాభిషేకాలు కట్టాలన్న మాట.

సూర్యు—అవును. పెండ్లిచేసుకొనే వధూవరు లిద్దఱూ ప్రేమాభిషేకంతోనే జీవించాలి.

సభా—బాగా చెప్పావు. దానికి మీ రిద్దఱూ తగిపోయినారుగాని, ముందు మీ రిద్దఱూ ప్రేమాభిషేకంలోపడి దారి చూపండి.

దూర్వా—నిశ్చయంగా. ఈ వినూత్న ప్రేమ సామ్రాజ్యపట్టాభిషేకానికి వాళ్లిద్దరే మార్గదర్శలు కాఁబోతున్నారు.

సభా—చాల్లేండి. ఎవరన్నావింటే నవ్విపోతారుగాని మీరుగూడా యీచెడు బోధనలకి మద్దత్తు ఇవ్వకండి.

కుంతి—ఈమహాత్ముల మద్దత్తుతోనే మేము ప్రేమారాధనకి దిగుతున్నాం. ఎవరధిక్షేపించినా, ఆగేదిలేదు. మానేదిలేదు.

సూర్యు—హరిహరబ్రహ్మాదులు దిగివచ్చిననూ జడిసేదిలేదు. ఈప్రేమోపాసన విడిచేదిలేదు.

సభా—అఘాయిత్యపుపనికి ఇదివఱకే ముహూర్తం పెట్టుకొన్నారన్న మాట. అయితే అదెట్లా జరుగుతుందో చూస్తాం కానీండి.

దూర్వా—ముమ్మాటికి జరిగి తీరుతుంది. ప్రేమోపాసనకు మించిన మహాప్రతిభాప్రభావము ఇంకొకటిలేదు. దానికి దాసులుకానివారెవ్వరూ వుండరు. అంచేత ప్రేమారాధన చేస్తున్న యీనవీన దంపతులే జగత్కల్యాణమహోత్సవానికి మార్గదర్శులు.

సభా—(లేచి) వీళ్ళు జగత్కల్యాణానికి మార్గదర్శులుకారు. జగన్మారణానికి కార్యకర్తలు. ఇహ వీళ్ళఆటలు సాగనివ్వరాదు. మీ మాటలు పాటించరాదు.

(నిష్క్రమించును)

దూర్వా—వీడివల్ల వచ్చిపడే భయం ఏమీలేదు. పదండి.

(సూతుడు, దూర్వాసుడు నిష్క్రమించును.)

కుంతి—ఇంత మనోహరవసంతంలో ఎంత గాలిదుమారం లేపాడో చూడండి.

సూర్యు—ఫరవాలేదు. ఇంతచక్కని ప్రేమవసంతరాజ్యంలో వడగాడ్పులూ లేస్తై. మలయమారుతాలు వస్తై. భయపడవలసిన పనిలేదు. మండుటెండ కడుపులో మలయమారుతం వుంది.

కీర్తన

తోటలో కోయిలనై ఏటిలో కెరటమై
దండలో దారమై గుండెలో గాలమై
నామాట సాగిపోదా
ఎల్లైన
మీలోన దాగిపోదా
వడివడిగపోవు నల్లత్రాచులో రోషమై,
నడికడలి లేపు బడబాగ్నిలో దాహమై
నామాట సాగిపోదా
ఎల్లైన
మీలోన దాగిపోదా
రివ్వురివ్వునవచ్చి కవ్వించు వేగమై
పువ్వుపువ్వునువిచ్చి నవ్వించుకిరణమై
నామాటసాగిపోదా
ఎల్లైన
మీలోన దాగిపోదా
దిశలెక్కి శివమెక్కి గురుదేవులకు మ్రొక్కి
జగమెల్ల కదలించు యుగరాజమేఘమై
నామాట సాగిపోదా
ఎల్లైన
మీలోన దాగిపోదా.

(నిష్క్రమింతురు, తెరపడును)

4 వ రంగము

బహిరంగసభ : సాయంత్రం 5 గంటలు నగరసంకీర్తనతో సభానిర్మా
తలు, సభాధ్యక్షులూ, నానారకములుగావున్న ప్రజలు
సభానమావేశం చేతురు

చక్కచక్కని అలంకారాలతో నిర్మించిన వేదికమీద నిలబడి
గంభీరంగా సభాపతి వుపన్యసించును

సభాపతి—అధ్యక్షా! సోదర సోదరీమణులారా! నేడు మనమంతా సనాతన ధర్మాలకోసం సమావేశమైనాం. మహాపవిత్రమైన వేదమాత సంస్థానమై అనంత విశాలధర్మక్షేత్రమై ప్రపంచ ప్రఖ్యాతి సంపాదించుకొన్న భరతఖండమందు మనంపుట్టి పెరిగి, కృతార్థులమై చరితార్థులమై పేరుకెక్కినవాళ్ళం. ఈ విషయం, ఈ విశ్వాసం, మఱెప్పుడూ మఱెవ్వరూ మఱవ కూడదు.

చ. చరితములన్ని కొల్వఁబడు శాంతినికేతనశాలలో, ఋషీ
శ్వరులు తపస్సులోఁజెడి ప్రశాంతపవిత్ర కళాస్రవంతులన్
గరఁగి మృగాలు జంతువులు కక్షులువోయి సుఖించుచున్న యీ
భరతధరిత్రికంటె ఘటిస్వర్గములేమ సమస్తభూస్థలిన్.

ఇంత పవిత్రమైన యీ భారతదేశంలో సనాతనధర్మం వర్ణాశ్రమ ధర్మాలతో నడుస్తున్నది. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః" అని గీతావాక్యం శాసించింది.

అంటే, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతులు నాలుగున్నూ నాచే సృష్టింపబడినవని శ్రీకృష్ణభగవానుఁ డుపదేశించాడు. వారివారి గుణకర్మలవల్ల నాలుగు వర్ణస్థులు ప్రజలు విభాగించఁ బడుతున్నారు. వేదశాస్త్రాలు నేర్చి, ధర్మోపదేశకుఁడైన వాఁడు

బ్రాహ్మణుఁడు. అటువంటి బ్రాహ్మణుఁ డుపదేశిస్తున్న వైదిక ధర్మశాసనాల్లో ప్రకారం క్షత్రియుఁడు భూపాలకుడు కావాలి. అటువంటి భూపాలకుడు శాసించినవిధంగా, వ్యాపార గోసం రక్షణతో వైశ్యుఁడు నడవాలి. అటువంటి వైశ్యుఁడు కోరినట్లుగా పాటుబడి భూఖండాన్ని సస్యశ్యామలభరితం చేసి, సమస్తమైన పాడిపంటల్ని పండించటానికి శూద్రుఁడు నడవాలి. ఈనాలుగు ధర్మాల్ని ఎవరెవరు పాటించక ధిక్కరిస్తారో అప్పుడు భూమండలం మీాద, ధర్మహానికలిగి, మహాపాతకాలు లేచి, ప్రళయతాండవం చేస్తై. ఇంతవఱకూ మన రాజ్యంలో ధర్మశాసనతిరస్కారం చేయక హాయిగా ప్రజలంతా ఆయురారోగ్య భాగ్యాలతో సుఖజీవనం చేస్తున్నారు. నేఁడు మన భూపాలకుఁడైన భోజుఁడు అల్పరాజ్య గర్వాంధుఁడై, వేదశాస్త్ర తిరస్కారుఁడై బ్రాహ్మణ ధర్మోపదేశాల్ని పాటించక, ప్రపంచ ప్రజాశ్రేయస్కరం కోరక నీతిదూరుఁడై, నిరంకుశుఁడై ధర్మహాని తెచ్చిపెడుతున్నాడు.

ఏనాఁడన్నా తన తాతముత్తాతలు ఈడువచ్చిన పిల్లకి పెళ్ళిచేయకుండా దురాచారాలు నేర్పి యిట్లా నడుచుకొన్నారా ? ఇట్లా కట్టుబాట్లు పాడుచేసి ప్రజల్ని పొడిచిలిన్నారా ? ఈ ధనమదాంధుఁడైన భోజుఁడు తనకూతురైన కుంతికి పెళ్ళిచేయకుండా యింత కాలంవుంచి ముద్దులమనుమణ్ణి గాంచి, పెంచుతున్నాడు. ఈరహస్యం యీానదస్యంలో బట్టబయలు చేస్తున్నాను వినండి.

ఎవఁడో దూార్వాసుఁ డనే పేరుగల ఋషిపుంగవుడొచ్చి, అవివాహితమైన తన పిల్లకి, మంత్రోపదేశం చేసి పుత్రుణ్ణి ప్రసాదించి పోయినాఁడట. ఎంత అపహాస్యం ఎంత మహారహస్యం వినాల్సి వచ్చిందో చూడండి.

ప్రజల్ని కాపాడుతున్న ప్రభువులే యిట్లా నడుస్తున్నప్పుడు ప్రపంచ శాంతి పటాపంచలు కాదా? వర్ణాశ్రమధర్మాలు పాడై పోవా? ఇహ మనం సహించకూడదు. లోకంలో ధర్మహాని కలిగి నప్పుడు వివేకధనులు నిద్రపోకూడదు. ఎటువంటి ప్రభువునైనా సరే ఎదుర్కొని ధర్మమార్గానికి రప్పించాలి. లోకకళ్యాణం జరిగించాలి. ఊళ్లో మనవంటి వేదశాస్త్రపారంగతులుండగా మనమేమాత్రమూ పనికిరాక, తనకీ, తనకుమారెకీ ఎవడో సన్యాసియైన దూర్వాసుడు మంత్రోపదేశికుడుగా కావల్సి వచ్చింది.

ఇహ సహించకూడదు. క్షమించకూడదు. ఈకులభ్రష్టుడైన భోజుణ్ణి మనమంతా కలిసి వెలివేయాలి. అప్పుడుగాని దారికిరాడు. ఇహ మనతో సంప్రదించందేమట్టుకు ఎవణ్ణోతెచ్చి పూజించడు. అయితే మనకు ప్రభువుకనుక ఒకతడవ మంచిగా చెప్పి విని పించుదాం. ప్రాయశ్చిత్తకర్మ విధించుదాం. వినకపోతేమటుకు తెగించి వెలివేద్దాం.

గీ. మూడు భువనాలు మోసి కాపాడుచున్న
వేదజననీకటాక్ష మీవిప్రవరుని
జిహ్వపై నిలుచుండి రక్షించునపుడు
భయములేదిక లెండు విద్వాంసులార.

జై వేదమాతకీ జై. (వర్షంరాగా ప్రజలు లేచి పోబోదురు)

సభాపతి—అయ్యా! మహాజనులారా! వెళ్ళవచ్చు కూర్చోండి. మనం ఇటువంటి వర్షానికే భయపడితే తెచ్చిపెట్టేది కష్టమేతప్ప వచ్చి పడే అదృష్టమే వుండదు. తిరిగి యీమహాసభ నాలుగురోజు లకు ఏర్పాటు చేస్తాం గనక తప్ప దయచేయాలని ప్రార్థిస్తూ నేటితో యీసభ ముగిస్తున్నాం. జై వేదమాతకీ జై.

(తెరపడును)



శ్రీ

# మహారథికర్ణ

## ద్వితీయాంకం

1 వ రంగము

రాజమందిరం : ఉదయం

సోఫాలతో, కుర్చీలతో, అలంకరించి యుండును

[భోజుఁడు, మంత్రి, ప్రవేశింతురు]

భోజు—మంత్రిశేఖరా! దూర్వాసుడి మంత్రప్రభావం చాలాగొప్పది.

మంత్రి—రాజా! మహాఋషి వాక్కులకు తిరుగులేదు.

భోజు—అదిసరే; ఇంకా పెళ్ళిచెయ్యని నాకుమార్తెకు సంతానఫలం ప్రసాదించాడు. దీనివల్ల లోకనింద ఎంత విఱచుకొని మీాద పడునో తోచకుండావుంది.

మంత్రి—ప్రభూ! లోకనిందలకు మనం భయపడకూడదు. లోకులు పలుకాకులు. నేనికీసహించరు. అదీగాక మహాఋషిపుంగవుల మంత్రోపదేశానికి ఏదోషమూ ఆపాదించదు.

[కోపంతో సభాపతి ప్రవేశించును]

సభా—ఆపాదించదుగా.

మంత్రి—(విభ్రాంతిపడి) స్వామీ! నమస్కారములు. దయచేయండి.
భోజ—నమస్కారములు స్వామీ! ఇట్లా దయచేయండి.
సభా—(ఆగ్రహంతో) దయచేయటానికే వచ్చింది.
శా. సంతోషమ్ముగ సర్వసౌఖ్యములు మీసంస్థానసౌందర్య భూ
కాంతుల్ వట్టినకారణమ్మున నృపా! కండ్లింతగాఁబూడి, శు
ద్ధాంతః స్త్రీలకు దాసులై నిగమవిద్యాధర్మముల్ వీడి, ని
శ్చింతన్ గాలముఁ బుచ్చుచుండిర? మహాసింహాసనాసీనులై.
భోజ—స్వామీ! నిరపరాధులం.
సభా—అల్పరాజ్య మదాంధులకు అపరాధమూలేదు, అపరాధమూ లేదు. అవరోధమూ లేదు.
గీ. బక్కవాఁ డింత పొరఁబాటు పడ్డగూడ
కోసి వానిని తినగోరు కొనునుగాని
ధనమదాంధుఁడు చేసిన తప్పుపనికి
గట్టిగా చెప్పఁ డొక్కఁడు కఠినశిక్ష.
భోజ—స్వామీ! మావల్లవచ్చిపడ్డ అపరాధమేమిటో సెలవివ్వండి. మే మెల్లప్పుడూ బ్రాహ్మణవాక్యాల్ని శిరసావహించువాళ్లమే గాని, తిరస్కరించువాళ్ళముగాము. సెలవిండు.
సభా—తిరస్కరించువారుకారా మీరు?
భోజ—కాముస్వామి.
సభా—అట్లైన, పెండ్లికాని మీ కుమార్తెకు సంతానప్రాప్తి యెక్కడిది?
భోజ—స్వామీ! మీవంటి తపోధను లిచ్చిన మంత్రమహాత్మ్యమువల్ల.
సభా—ఆ...మంత్రమహాత్మ్యమువల్ల చాలుగాని సమాధానం కట్టిపెట్టు ఈగుట్టు ఎవరికీ తెలియనిదికాదు. మంత్రాలకు చింతకాయలు రాలవు. పైగా మావంటి తపశ్శాలి యెవఁడో మీ

వెంట వుండి, దివ్యమైన దీవెనలతో మీకు సమస్తైశ్వర్యాల్ని ధారపోస్తున్నప్పుడు, ఇంకా మాఅదుపాజ్ఞలెందుకు? నీతినియమాలెందుకు?

భోజు—స్వామీ! ఆగ్రహించకండి. మావల్ల వచ్చిన నేరమేమిటో సెలవిచ్చి రక్షించండి.

సభా—క్షమించరాని దోషం, భరించరాని దోషం మీరాజవంశాలలో గూడుకట్టుకొని వున్నై.

భోజు—నిజమే స్వామి.

సభా—అయితే! మీకుంతి యీడొచ్చిన పిల్లగదా, పెళ్ళిచేయకుండా ఇన్నాళ్లెందుకాపావు?

భోజు—తగిన సంబంధం దొరకకనే స్వామి!

సభా—సంబంధం దొరకలేదని యిట్లా పెళ్లాపావుగాని, అదుపాజ్ఞల్లో పిల్లనిమట్టు కాపలేకపోయినావన్నమాట. అంచేతనే యీలోకంలో పిల్లకి ఎనిమిదవయేట పుస్తె కట్టమంటున్నదిధర్మశాస్త్రం

భోజు—చిత్తం స్వామి!

సభా—ఇది మంత్రమహత్తుకాదు. మనిషి మహత్తు. తెలిసిందా? లోకానికి మూకుడులేదు. జారచోరత్వాలు దాగవు.

భోజు—యథార్థం స్వామి!

సభా—కనుక ధర్మశాస్త్రతిరస్కారంచేయకుండా త్వరగా ఏదో ప్రాయశ్చిత్తకాండకి దిగండి. లేదా "యథారాజా తథాప్రజా" అన్నదాన్ని సార్థకం చేసినవాడ వవుతావు.

భోజు—చిత్తం. తప్పనిసరిగా మీరుచెప్పిన ప్రాయశ్చిత్తానికి దిగుతాం తమరే సెలవివ్వండి.

సభా—అయితే! ఇదిగో! శీఘ్రమే మీ అంతఃపురంలో వున్న బాలుణ్ణి యెక్కడైనా పారేసిరండి.

మంత్రి—(చెవులు మూసుకొని) శివశివ మహాపాపం.

సభా—అట్లాగా? ఇట్లావుంటే పాతకం లేదన్నమాట ఎట్లాగైతే యేం? జాలిగలవాడవు దొరికావు పాపం. దగ్గఱ మీవంటి వాళ్లు దాపరించారు కనుకనే, వర్ణాశ్రమ ధర్మాలన్నీ వల్లకాట్లో కలుస్తున్నై.

భోజ—మీకెందుకు మీరు చెప్పండి స్వామి!

సభా—వెంట అట్లా గొణుగుతాడేమిటి? నేను చెప్పిన పని ముందు చేసిరండి. తర్వాత చేయాల్సినవి చెబుతా. (నిష్క్రమించును)

మంత్రి—ఈ బ్రాహ్మణులన్న మీకింత భయమెందుకు?

భోజ—వారి వాక్కు దారుణాఖండలశస్త్రతుల్యం గనుక.

మంత్రి—అయితే! మఱి మాకు భయం లేదేం?

భోజ—మీకు వారి అద్వితీయప్రభావం తెలియక పోఁబట్టే. మంత్రి పుంగవా! నింద కట్టుకొని జీవించటం చాలా దుర్భరం. నిజంగా పెళ్లికాని పిల్లకి పిల్లవాఁడెట్లా జన్మిస్తాడు? ఇది మహా ఆశ్చర్యమైన విషయం. నమ్మదగిన విషయం కాదు. ఇందులో ఏదో కుంభకోణం వుండితీరుతుంది. సందేహం లేదు. పాపహేతువును వొడికట్టుకొని, యిది మహాఋషిపుంగవులిచ్చిన వరప్రసాదమనీ, మంత్రమహత్తనీ, సంతోషించి సంతృప్తి పడటం చాలా ఘోరకార్యాలకి దారితియటం అవుతుంది. నిజంగా సభాపతిగారు చెప్పినట్లు చేస్తేనేతప్ప నారాజ్యం బాగు పడదు. లేకపోతే, "యథారాజా తథాప్రజా" అన్నమాట

సార్థకమై తీరుతుంది. ఏదెట్లైననూ సరే ముందు అంతఃపుర ములో కులుకుతున్న కుంతి పిల్లవాణ్ణి బయటపారేసి రావల్సిందే.

మంత్రి—ఇది మహాదోషం ప్రభూ!

భోజ—దోషమూ లేదు గీషమూ లేదు. మీరు మాట్లాడకండి.

మంత్రి—ప్రభూ! కటాక్షించుడు. అరణ్యాలలో, ఆకులూ, అల ములూ తిని అనవరతం మహాతపోనిష్ఠాగరిష్ఠులై, లోకకళ్యాణం కొఱకు సమస్త వేదశాస్త్రాలు వ్రాసిన మహాఋషిపుంగవుల వాక్కు వరప్రసాదం గాక యీనాటి కుక్షింభరులైన యిటు వంటి బ్రాహ్మణరాక్షసులవాక్కు వరప్రసాదమగునా? ప్రభూ! మునపటి మహాఋషిపుంగవులవాక్కువల్లనే సూర్యచంద్రాదులు వెలిగి లోకాలు తెల్లవారుతున్నై.

ప్రభూ! ఎందుకీపట్టరాని పట్టుదల? మీగర్భవాసమందు జన్మించిన కుమారైమీాద మీకెంత ప్రీతివున్నదో, అట్లాగే కుంతి కుమారుడుమీాద కుంతికిప్రీతి వుండకపోవునా? ఎంత ప్రీతితో మునిపుంగవుని అర్థించి, అనుగ్రహభాగ్యమూ, మంత్రవర ప్రసాదమూ మీతల్లి సంపాదించి సంతోషిస్తున్నదో చూచి కనికరించండి. ఇంత మహాదారుణకార్యానికి నడుం కట్టకండి. ప్రభూ! నిజంగా దూర్వాసమహాఋషిపుంగవు డిచ్చిన మంత్ర మ్మలో, జగత్సాక్షియైన సూర్యుణ్ణి ప్రార్థించి, మీా తనయ కుమారుణ్ణి కన్నది. యథార్థంగా, విశ్వాస హృదయంతో, మహాఋషిపుంగవుల మంత్రరాజములను ఎవరు వాడుకొందురో వారికి వాటిఫలితం తప్పదు. ప్రభువులకు ఆలోచనకావలెగాని, ఆగ్రహం వలదు.

ఉ. నోచిన నోముపంటకు మనోహర మోహన చక్రవర్తి చే
జాచినవారి చేతికి నిజమ్ముగఁ జిన్నివరాల తండ్రి మీ
పూచిన తోటలో దిరిగి ముచ్చటఁ దీర్చెడి ముద్దులయ్యె, యీ
నీచుల మాటలో కడుపు నిప్పులగుండము సేయకో ప్రభూ.

భోజు—ఇది చాలా అనుమానంగా వున్నవిషయం దీన్నిగురించి మీరేమీ చెప్పకండి. మీరెన్ని చెప్పినా ఇహ నాచెవికెక్కవు. ప్రజల్ని పరిపాలిస్తున్న ప్రభువు లోకనింద పడరాదు. మీరు పోయి మీ రాజకార్యములు చూచుకోండి. మాపిల్ల వస్తున్నది మీరువెళ్ళండి.

మంత్రి—అనుగ్రహించాలి. మీకోరులు చెప్పవలసినవిలేవు. వెళ్ళి వస్తాను సెలవ. (నిష్క్రమించును)

భోజు—ఎంతవిశాల మహీఖండాన్ని పాలిస్తున్న ప్రభువుకైనా, యేదో వొక కష్టంవచ్చి పట్టుకొంటుంది. ఇంత రమణీయమైన సువర్ణ సౌధాలలో సుకుమార సుఖభోగలాలసులైన వాళ్ళగ్గూడాపట్టి వదలిపెట్టని చింత యేదోవొకటి యెప్పుడూ వేపుకుతింటూ వుంటుంది. ప్రతిమానవుడికీ, కష్టసుఖాలు శ్వాసవుచ్ఛ్వాసల మాదిరి వచ్చిపోతుంటై. అనుకొంటుండగానే, ఇంతలో ఎంత నింద కొండమాదిరి విఱిగి మీదపడింది. అందుకే లోకానికి వెఱచి బ్రతకాలి. (ఆలోచిస్తూవుండును.)

[పిల్లవాణ్ణెత్తుకొని కీర్తన పాడుకొంటూ కుంతి ప్రవేశం]

కీర్తన

తొడిమలోమొగ్గవై పుడమిలోనిగ్గువై
మురళిలో కెరటమై ముద్దులోప్రాణమై
నాతండ్రి ఆడుకోరా
హాయిగా
నాపాట పాడుకోరా ॥తొ॥

భోజు—పాడుకొంటాడు గాని నీకీ పిల్లవాఁ డెక్కడదొరికాడు ?

కుంతి—అదేమిటితండ్రీ ! కోప్పడుతున్నావు ?

భోజు—కోపమూలేదు తాపమూలేదు గాని ఆపిల్లవాఁ డెవరిపిల్ల వాఁడు ?

కుంతి—నీముద్దుల మనుమడు నాన్నా !

భోజు—సరేలెద్దూ, ముద్దులూగిద్దులూ కట్టిపెట్టి చెప్పు.

కుంతి—నీవెఱుగనట్టడుగుతావేమిటి ?

భోజు—అవును. నేనెఱుగను కనుకనే అడుగుతున్నాను. ఎవరిపిల్లవాఁడో చెప్పు.

కుంతి—ఎవరిపిల్లవాఁడో ఏమిటి. నాబంగారుతండ్రి నావరహాలకొండ. (ముద్దుపెట్టుకొని) చూడు నాచిన్నితండ్రీ ! నీతాతయ్య యేమంటున్నాడో, కోపం తగ్గించుకోమని చెప్పు.

భోజు—చెబుతాడ్లే; వాఁడెవఁడో చెప్పు.

కుంతి—వాఁడు జగత్సాక్షికుమారుఁడు, మహాఋషి వరప్రసాదమున జన్మించినవాఁడు, కోప్పడక ముద్దుపెట్టుకో. (అందిచ్చును)

భోజు—(కోపంతో పిల్లవాణ్ణి సోఫామీఁదవేసి) ఛీ, రాజవంశఘాతికీ ! పాపిష్టురాల. నీమొహం చూడగూడదు. నీవాపిల్లవాణ్ణి వదలి పెడితేనే, నేను నీకు తండ్రిని. పో అవతలీకి. సిగ్గులేనిదాన. మా కడుపున చెడపుట్టావు. (నిష్క్రమించును)

కుంతి—(కన్నీళ్లు తుడుచుకొని పిల్లవాణ్ణి తీసుకొని)

ఉ. నావరహాలనాన్న ! వడినావటరా యిల పాడుతాలపై
జీవములుండెనా కొడుక ! ఛీ యిటువంటి కసాయిజాతిలో
కేవలమీఁగతిన్ బ్రదికి కీర్తిగడించుటకంటె, హాయిగా
నీ విఁక భీకరాటవికి నిక్కముగా బలియైన మేలురా.

నాబంగారుతండ్రీ! పసికూనవన్న జాలియైననూ లేకుండా ఎంతకనరి
కొట్టి పోయినాడురా తండ్రి!

ఉ. నానగుమోములయ్యా! భువనాలకు నీ చిఱుబొజ్జభారమే
మోనుర! యీ మహామృగసమూహము ముంగటవేసె నిన్ను, దై
వానికి గూడ నీవయిన పాపము కన్పడెనేమొ, ఘోర దా
వానల కుక్షిలోఁబడితివా తనయా! మమునింక చూడవా.

నన్ను గన్నతండ్రీ! నా బంగారుకొండా! ఇంత దురదృష్టవంతురాలి
కడుపున యేల పుడితివిరా?

ఉ. ఏడవకయ్యా! నా సుకృత మీగతి చూపెను జక్కనయ్యా! యీ
మేడలవారి కెవ్వరికి మీగడవంటి మనస్సులేదు, నీ
గోడును నాదు గోడును సఖుల్ విని పోవుటకైన లేరు, కా
పాడెడివాఁడె యీ పుడమిపై కఱవయ్యెనొ యేమొ పుత్రకా!

[దాసి ప్రవేశం]

దాసి—అమ్మగోరు! ఏంటండి?

కుంతి—ఏమీ లేదు.

దాసి—ఏంటో సెప్పండి. అబ్బాయిగోరుపడ్డారా?

కుంతి—అవును. ఈ దురదృష్టవంతురాలి కడుపునపడ్డాడు.

దాసి—అదేంటండి. అట్లా తిట్టుకొంటారు. మీకేం తక్కువ? మా
సిన్నిదొర గోర్కి ఏం తక్కువ?

కుంతి—ఈ నిరంకుశరాజసంస్థానాల్లో మా కన్నీ తక్కువే.

దాసి—అదేంటండి? మీ నాన్నగారికి మీకంటే పానం యింకోటేం
లేదండి.

కుంతి—లేకపోవటమే. తన రాజ్యం తన సంస్థాన నౌఖర్లు ప్రాణాలై
తేను. ఇంకా మే మెందుకు?

దాసి—కట్టం పెట్టుకోకండి. మీాకంటే పానం ఇంకోటేదీ లేదు.

కుంతి—ఉంటే, నాచంటినాయన్ని నాబంగారుతండ్రినీ, యిట్లా కసరి కొట్టిపోడు. చూడు నా నాయనమీాద ఈ ధన మదాంధుడైన రా జెంత క త్తికట్టాడో.

ఉ. ఇంత సువర్ణ సౌధముల నెక్కిన యీా దొరబిడ్డలంత, నేఁ
డెంతయొ బుద్ధిమంతులట, యీాగతిమాలిన దానిచేతిలో
అంత దిగంత కీ ర్తి ధనుఁడైన కుమారుఁడు హీనుఁ డంట, ని
శ్చింతగ నున్న దేవునికి సీ, చెవు డెక్కడ దాపరించెనో.

దాసి—ఏదో ఇనుగుతో వుండి అన్నార్లెండి. అసలు ఎంతమావాంటి మూాడులైనా కడుపుఁపుట్టిన బిడ్డలమీాద క త్తికట్టరమ్మా!

కుంతి—నీ కేమీా తెలియదు. ఈ నిరంకుశరాజ్యము త్తేభాల మదమాత్స ర్యాలు నీవంటి పిచ్చిదానీ జనానికి తెలియవు.

ఉ. గ్రంధములెన్నియో చదివి గందరగోళముసేయుచున్న కా
మాంధులవల్లఁపుట్టిన కుమారుఁడు కాఁడితఁడోసి! ఆజగ
ద్బాంధవుఁడైన సూర్యభగవానుఁ డొసంగిన ముద్దులయ్య, గ
ర్వాంధుల కేమి కన్పడవు పాపపుటూహాలు తప్పపో ల్తిరో.

దాసి—అయితే! తల్లి! ఈ మాయదారి గోలెప్పుడు లేసింది? పాడు లోకం ఏవో లేనిపోనివల్లా యిరిసిపోసి దానికళ్ళు సల్లార్చు కుంటుండది.

(క త్తితీసుకొని దూకుఁడుగా భోజుఁడు ప్రవేశం)

భోజుడు—ఏమిటేదానీ! వదరుతున్నావ్?

దాసి—(ఉలిక్కిపడి) ఏంలేదు దొరా!

భోజు—ఈలక్షణం యీాపిల్లవాణ్ణి తీసికెళ్ళి అడవిలో పారేసిరా.

కుంతి—(పిల్లవాణ్ణి పొట్టకు కఱచుకొని) నాబంగారుతండ్రినా ? నా వరహాలకొండనా ?

భోజు—కుంతీ ! ఇఁక నీగోల కట్టిపెట్టి యింట్లోకెళ్ళు.

కుంతి—నాచిన్నారి తండ్రిని వదలిపెట్టి నేనెక్కడికి కెళ్ళను.

భోజు—అనవసరంగా గోలలేపక, వర్ణాశ్రమధర్మాల్ని పాడుచేయక, దాసీ ! ఒక్క-క్షణం ఆలస్యంచేయక, ఊఁ ! తీసుకుపదా.

దాసి—సిత్తం. పిల్లవాణ్ణి ఇయ్యండితల్లీ !

కుంతి—హరిహరబ్రహ్మాదులు దిగివచ్చినా పిల్లవాణ్ణివ్వను.

దాసి—(దగ్గఱకొచ్చి తీసుకొనబోతూ) ఇయ్యండమ్మా !

కుంతి—ఛీ ! పాపిష్టురాల ! గొడ్డురాల ! అవతలికిపో.

భోజు—ఛీ ! కుకర్మురాల ! (కలియబడి పిల్లవాణ్ణి లాక్కొని) దాసీ ! ఇదిగో తీసుకుపో. (ఇచ్చును)

దాసి—సిత్తం. (తీసుకొని) (నిష్క్రమించును)

భోజు—పదా తొందరగా (నిష్క్రమించును)

కుంతి—(వెంటబడి)

తండ్రీ ! నా వరహాలతండ్రీ !

కీర్తన

కనికరములేని కఠినలోకమా !

మనసుకరగని, ధనికలోకమా !

హృదయము

లేదా

ఉదయము

కాదా (నిష్క్రమించు)

2 వ ర ం గ ం : అడవి

గంగానదీతీరం, పిల్లవాణ్ణెత్తుకొని దాసి వెళ్లుచుండును
[చింతిస్తూ వెంట కుంతి పడిపోవును]

కీ ర్త న

అడవిలో కూనవై పుడమిలో జాణవై
హాయిలో హంసవై రేయిలో రాజువై
నాతండ్రి బ్రదుకరావా
అచ్చోటు
నీకింత నెలవు లేదా
అడవిలో కూనవై పుడమిలో జాణవై
హాయిలో హంసవై రేయిలో రాజువై.

దాసి—(వెనక్కి తిరిగి) ఏం ఉంది. మీాపిచ్చి. సెబుతుంటే.
కుంతి—నాతండ్రిని, నావరహాలతండ్రిని విడిచిపెట్టి నేనుండలేను.
దాసి—మీాతండ్రైతే యీాడకెందు కొత్తాడు? పదండి. పారేసొత్తా.
కుంతి—ఓసీ! పాపిష్టురాల! ఎంతమాటన్నావే.

ఉ. నాతనయుండుకంటె, భువనమ్మున ప్రాణములేదునాకు, నే
డీతలలన్ని యేలెడి మహీతలమంతయు ధారఁబోసినన్
నాతనయుండు వచ్చునటె? నాతొలినోములపంట పండునే?
ఘాతకి! నీవు బిడ్డలను గాంచినదానవు కావటే కటా.

దాసి—మాకేమిా మీామాట లర్థంకావు. పొండి పెద్దవాళ్ళంతా సెప్పింది సేయటమే మాపని.
కుంతి—కుకర్మురాలా! పెద్దలెవరే?

ఉ. గుండెనుఱాయిఁజేసి, పసిగ్రుడ్డులపొట్టను పెట్టుకొన్న యీ
పండితులంత పెద్దలటె ? పచ్చికసాయిగవాడు కత్తితో
కండలుకోసి, యమ్ముకొని, కాలముఁబుచ్చెడివారుగాని, భూ
మండలమెల్ల మండి మసిమాదిరికాదటె జాలిలేనిచో.

దాసి—మీ రెన్ని సెప్పినా లాభంలేదమ్మా తల్లీ. మీరుపొండి, ఈ గంగలో పారేసొత్తాను.

కుంతి—ఓసీ ! శిశుఘాతకీ ! నన్నుగన్నతండ్రిని, గంగలోఁ బడద్రోతువుగా నీకు జాలిలేదా ? నీగుండెగూడా నల్లఱాతిబండగా మారినదా ? ఓసీ ! గొడ్డురాల ! ననుగన్నయ్య, నాచిన్నారి తండ్రి, నీకేమి ఎగ్గుకలిగించెనే ? గంగపొట్టకి నాపసికందును బెట్టి నీవేమి మూటగట్టెదవే ? నన్నడుగు, నీకు కావలసినంత ధనం నీమొహాన పారఁబోస్తా. ఇంకా కన్నెత్తి యీపాపిష్టి ప్రపంచం వంక చూడని యీపసివాఁడు, ఈనెత్తురుగ్రుడ్డు, క్రూరుఁడై నాఁడటే ? ధర్మదేవతకి కళ్లులేవా ? మహాఋషిపుంగవులగ్గూడా హృదయాలులేవా ? కటకటా ! ఎంతపాపిష్టికాలం దాపరించినదే ? దాసీ ! పసివాఁడిమీద పగవద్దు. నీజన్మకి పాపపుణ్యాలు వద్దా ? ఎంత ఘోరానికి సాహసించితివే ?

మ. ఇలపై నింతమనోహరుండయినవాఁ డెప్డైన జన్మించి నో
ములు పండించెనె ? యీమహాప్రభుకళాపూర్ణేందునిన్ గంగలో
పులివై త్రోసి, యిసీ ! నిరంకుశధరామూర్ఖావళిన్ దెచ్చి కొం
పలుమండింతువె ? రక్కసీ ! అడవిత్రోవల్ త్రొక్కఁకవ్వింతువే ?

సరేలెండి. మీసుద్దులూ మీనీతులూ మాకెందుకు ? (గంగలో దిగుతూ) మీరుపొండి.

కుంతి—(బిగ్గఱగా) ఓసీ ! దాసీ ! ఎందుకు నీళ్ళల్లోకి దిగుతున్నావు ?

దాసి—నేను సెప్పలేనుతల్లో. (పెట్టె గంగాప్రవాహములో వదలిపెట్టి) రఁడమ్మాపోదాం. ఏమిటీపిచ్చ (నిష్క్రమించు)

కుంతి—(పెద్దగా) నాతండ్రీ! నను గన్న బంగారుతండ్రీ! నీతల్లిని ఎంత అన్యాయంచేసి పోతున్నావురా! నాతండ్రి! నీతల్లిమీదయింత కక్షెందుకురా? నిన్ను మోయలేని యింతనిర్భాగ్యురాలిని యీ భీకరక్రూరమృగాలకు వొప్పజెప్పి పోతున్నావురా? తండ్రీ! నావరహాలతండ్రి!

ఉ. ఊరలేనాలమేడవయి, ఈసుకుమారకళాప్రసూన ల
క్ష్మీ స్మరమణీలలామ పులకించెడి డోలికలూగి, క్రూరులై
మారినవారికంటె నదిమధ్య మెుసల్లకు నచ్చినీకు; దు
ర్వార నదీప్రవాహములపై బడిపోతివిరా! కుమారకా!

నాబంగారుతండ్రీ! నీతల్లికి దిక్కెవరురా? ఇంతభయంకర గాఢాంధకారలోకంలో నేనెట్లు బ్రదుకుదురా తండ్రీ? నిన్ను చూచుకొని ఎంతమురిసిపడితినిరా నాకన్నతండ్రి! దైవమా! నీవు దయాసముద్రుడవు. నిరంతర నిర్నిద్రకరుణాకటాక్షం కలవాడవు.

మ. అదిగో! నావరహాలతండ్రి పయనంబై పోవుచున్నాడు, అ
ల్లదిగో! నాభువనైక మోహనుడు కర్రెపోవగా ఎంతఘో
రదశానంత విపత్తరంగములచే బ్రాల్మాలిన ట్టెటిలో
బ్రదుకెల్లన్ బడద్రెచెనోగని, కృపావారాన్నిధీ! గావుమీ.

---

3 వ రం గం

సూతుని గృహం

[కీర్తన పాడుకొంటూ సూతుడు ప్రవేశం]

కీ ర్త న

మెత్తనీకూలోన్ణి గదరా
మీరెగిరిపడితే జారిపడరా

బరువుభారము మోసి
కరిగిపోయాటో మన్య
కన్నీటికాల్వతో
పాకుడై పోయాను
మెత్తనికూలోణ్ణి గదరా
మీరెగిరిపడితే జారిపడరా

రాధ—(కోపంతో ప్రవేశించి) ఏంటినూనుకొని యీ యిరగబడటం?
సూతు—మన కాయకట్టంలో అదృష్టం నూసుకొనే.
రాధ—ఓలబ్బో! నీకింకా రాజ్యంవుం లే కాళ్లు కిందనిలవ్.
సూతు—అదేంటే; మనకి రాజ్యం లేకపోవడమేంది? మనకి రాజ్యంగా మనకొడుకు లేడంటే.
రాధ—ఎట్టాగె తేయ్యం! మూలావుకొడుకుని సంపాదించావ్. కొడుకట కొడుకు. ఈణ్ణి నేను మేపలేనుబాబో. ఏడకిపోతాడోఏమో. రాచతనాలు వొలకబోసుకొంటూ ఏళకిమట్టుకు కూడుకొచ్చి పడతాడు.
సూతు—ఏంటేవ్. నాఅయ్యని, నాదొరని, కసరి కొడుతుండావ్? నాఅయ్యే మనకి రాజ్యం బాగ్యం, ఏడి? ఏడకెళ్ళాడు?
రాధ—నీకు రాజ్యాలూ బాగ్యాలూ తీనుకు రాబోతూను.
సూతు—దేనికే అట్టా వెక్కిరిత్తావ్? ఏరోజుకైనా, నాఅయ్యే మన కట్టాలు తీర్సేది.
రాధ—తీరుస్తాడు కూకో. నేనింకా యీడికి శాకిరీ సేయలేనుబాబో. వకపనీ పాటాలేదు. వకపావలాడబ్బులు ఏనాడూ తెచ్చినపాపాన పోలేదు. ఈడు నీకట్టాలు తీరుసాడని మురుస్తూ కూకో.
సూతు—నాఅయ్యనేంటే; తెచ్చిపోయటం లేదని యిసుక్కొంటుం డావ్? నేను తెచ్చి పాకేసేవి నీమొహానికి సాలటంలేదా?

రాధ—నీవు తెచ్చి పారేత్తున్నావుగనుకనే యిట్టా ఒకనగా నాణెం లేక బోసిపోయి వుండా. నీవు తెచ్చి పారేస్తే నీకే వార్సిపోస్తా. అంతేగాని, అడ్డమైనోళ్లనీ తెచ్చి శాకిరీ సేయమంటే నేను సేయులేనయ్యో.

సూతు—రతనంవొంటి కొడుకుని ఎందుకే యిట్టా కసరికొట్టుకొంటావ్?

రాధ—రతనం కాదు. నాపానానికి వురితాడుగా వుండాడు.

సూతు—నోటికొచ్చినట్టల్లా కూయకే. ఇంకా వూర్కుకొండేదిలేదు.

రాధ—ఇదేంటితల్లో. బయటోణ్ణెవణ్ణో తెచ్చి మేపమని కొట్టొస్తాడు? నాసేతకాదు. నేను సేయలేను. నీవే కాచిపోసి పెంచుకో.

సూతు—ఇదిగో! సెబుతుండా. ఇంటే ఇన్నావు. లేకపోతే నీకు మూడింది.

రాధ—ఏంసేత్తావ్? సంపేస్తావా? బాగావుంది వురి. ఎక్కడో దిక్కుమాలినోణ్ణి తెచ్చి పానం తీత్తావా?

సూతు—అట్టాగే కూయొద్దంటున్నా. ఒళ్లు పగిలిందాకా వూరుకో వల్లేవుండాల్.

[కీర్తనపాడుతూ కర్ణుడు ప్రవేశం]

కర్ణ—ఏమిటినాన్నా! మా అమ్మను కోప్పడుతున్నావు?

సూతు—ఒళ్లు బలిసి కొట్టుకొంటుండదిరా.

కర్ణ—నాన్నా! నా అమ్మను ఏమనక.

సూతు—ఇది అమ్మగాదురా. మన పానాలకి దయ్యం.

రాధ—దిక్కుమాలిన వచ్చినోళ్లకల్లా నేనెట్టా అమ్మనౌతాను?

సూతు—ఏంటే వాగుతుంటావ్? ఈపాలను (కొట్టపోగా)

కర్ణ—(పట్టుకొని) నాన్నా! కోప్పడక.

ఉ. దైవముగూడ ధాత్రిపయి తల్లి ఋణమ్మును తీర్చలేఁడు; మా
జీవితముల్ మరెన్ని బలిచేసిన తీరదు; మాతృసేవకై
భూవలయమ్ము మీఁద తొలి పుణ్యములన్నియు ధారఁబోసి, నేఁ
డీ వెలలేని కీర్తి గడియింతును తండ్రి! యనుగ్రహించుమీ.

సూతు—సిగ్గులేనిదాన! ఇన్నావంటే ఎంత బోదసేశాడో!

రాధ—ఈ బోదలు వార్చిపోత్తె కూకోండి.

కర్ణ—అమ్మా! నీకేమి కావలసినా సన్నడుగు. నీ కోర్కె తీర్చటానికే నీ కుమారుడు పెరుగుతున్నది.

ఉ. ఎల్ల జగాలు గెల్చి జనులెల్ల నుతింప సమస్త భాగ్యముల్
కొల్లఁగఁ దెచ్చి యిచ్చు కొడుకున్ గని నమ్మవు; దేని కింక చిం
తిల్లుట నీవు? నీ సుతుఁడు దేనికి పెర్గుట నీదు కష్టముల్
మెల్లఁగఁ దీర్పఁ తల్లి! వినుమీ కనుమీ పసివాని ప్రార్థనల్.

సూతు—సిగ్గు మాలినదాన! ఇంటున్నావా నా బంగారుతండ్రిమాటలు.

రాధ—ఇంకేం వరహాల మాటలు.

కర్ణ—అమ్మా! ఇవిగో! వరహాలమూటలు. (డబ్బుసంచులు పడేయు)

రాధ—(తీసుకొని) ఎక్కడివిరా అయ్యా? బువ్వతిందువుగానిరా.
ఏవేళైందిరా నీవొస్తావని చూస్తున్నా. (కర్ణుణ్ణి ముద్దుపెట్టుకొను)

సూతు—ముల్లె తెచ్చి మొహానవేయకపోతే, చేసుకొన్న ఆడదానికి మొగుడూపనికిరాడు. కష్టపడి కన్న తల్లికి కొడుకూపనికిరాడు. ఇట్టానడుస్తుందదిలోకం. పదండి బువ్వకి.

(నిష్క్రమింతురు)

తెర పడును.



# మహారథికర్ణ

## తృతీయాంకము

### 1 వ రంగం

బంతిఆట ఆడుకొను ప్రదేశం

ధర్మరాజు నూతిలోపడ్డ బంతికోసం చూస్తుండును

(బంతి పాడునూతిలోపడి, పంచపాండవులూ దుర్యోధనాదులూ ఒకరికొకరు మాటలనుకొందురు)

దుర్యో—ఇంత ప్రతాపంతో, పరాక్రమించి, మహాప్రగల్భాలు కొడుతున్న యీ పంచపాండవుల పసకాస్త బయటపడ్డది.

భీము—ఇంత సుకుమార సుఖభోగలాల సత్వంతో పరాక్రమించి, బడాయిలు కొడుతున్న మీ కౌరవేయుల బలంకాస్తా యిప్పుడు బయటపడ్డది.

దుశ్శా—(నవ్వి) అవును. బయటపడ్డది కనుకనే మన వ్యవహారంకాస్తా ఆహారానికి ముందుపడ్డది. వీరవిహారానికి వెనకపడ్డది.

భీము—ఇహ అనవసరంగా ప్రేలక.

ఉ. ఏమొనగానికైన పయికెత్తగ శక్యముకాని దాని యీ
భీముఁడుకాడె వచ్చి నిలపెట్టి ప్రతిజ్ఞను నిల్పఁబెట్టు; మీ

రేమిటి? మీ మహాప్రతిభ లేమిటి? నాభుజశక్తి కేముందు? చూ
చామురదిక్కులెక్క బలశౌర్యసముద్రుల నెంతమందినో.

దుశ్శా—(నవ్వి) అవునవును. నిజం చెప్పాడు.

ఉ. ఏ మొనగాఁడు గూడమును పెన్నఁడు లేపని పెద్దముద్ద యీ
భీముఁడు లేపు, దీనికి కవీరుఁడు భీముఁడుగాని, యూరణ
స్వాములుగారు; నమ్ముఁడు నిజమ్ముగ భోజనయుద్ధమందు బా
బోమటి వీసి బాహుబలపుష్టికి లవ్వ డొకండు చూడుడీ.

దుర్యో—(నవ్వి) దుశ్శాసనా! యథార్థం చెప్పావు.

ఉ. మించినవాఁడు లేఁడని భ్రమించుచు నింతటితిండిపుష్టిఁ జూ
పించెడి భీమసేనునకు వీరు సహోదరులైన నింక క
ల్పించెడివారు లేరసలు వీరిని; కొండటు పైకి యేమి క
న్పించరు, వారి బాహుబలవీరకళాచతురత్వ మెట్టిదో.

భీము—(గుడ్లెఱ్ఱఁజేసి) అధికవాచాశూరత్వముతో మాకేమాత్రమూ
నిమిత్తం లేదు.

అర్జు—అన్నా! భీమసేనా! ఎన్ని అన్ననూ ఫరవాలేదు.

ఉ. మత్సరమెందుకింత పదుమాటలకున్ జెడిపోదుకీర్తి, యీ
యుత్సవ మెప్పుడుండదు; మహోగ్రరణావని చీల్చి చెండి భీ
భత్సము సేయునాఁడు తమప్రాణము గుప్పిటఁబట్టి యింక భీ
భత్సుఁడెవండో భీముఁడు నెవండో మహీపతి గాంచకుండునే.

నకులుడు—అన్నా! ఫల్గునా!

గీ. లోకమెట్టిదో తెలియని మూకముందు
ప్రతినబట్టుట దేనికి ఫలితమున్నె?
మనము పుట్టంధులకు పుత్రధనము కాము
కలహమీనాఁడు వారితో వలదు మనకు.

నహదేవుడు—అన్నలారా!

గీ ఆటమఱచి పోరాటముమాటఁదెచ్చి
మనమొకొళ్ళొకళ్ళము నేఁడు పెనఁగికొనిన
నవ్విపోదురెవ్వరయిన, చివ్వకింక
కాలుద్రువ్విపోదురు చాలుచాలు వినుఁడు.

ధర్మ—తమ్ములారా! వింటిరా!

మ. మనలో నందఱికంటె పిన్నయయి యేమాటెత్తి నోరెత్తనీ
యనివాఁడై పహదేవుఁడెంత హితవాక్యంబింత సౌఖ్యంబుగా
మనకెల్లన్ వినిపించెనోకనుఁడి; యీనుర్యాదనేఁడెవ్వఁడై
ననుగైకోనిదె వానిశౌర్యఘనవిన్యాసమ్ము వర్ధిల్లదే.

[ద్రోణాచార్యులు ప్రవేశం]

ద్రోణు—ఏమదినాయనలారా!

ధర్మ—భూసురోత్తమా! నమస్కారములు.

(అందఱూ నమస్కరింతురు)

ధర్మ—బ్రాహ్మణపుంగవా! నేనూ నాతమ్ములూ కలసి బంతియాట ఆడుకొనుచుండగా బంతి యీపాడునూతిలో బడ్డది. నుయ్యి చాలా లోతుగలదిగా కనిపిస్తున్నది. అంచేతమేముబంతికోసం నిలబడి చూస్తున్నాం.

ద్రోణు—మీాకు అస్త్రవిద్యాగురు పుంగవులెవరు?

ధర్మ—కృపాచార్యులువారు.

ద్రోణు—అయితే మీారంతా భీష్మాచార్యులవారి మనుమలన్నమాట. మీా తాత చాలా గట్టివాఁడు.

చ. మునుపొకసారి యీశ్వరసముండగు భార్గవరామునిన్ మహా
ఘనతరమైన తీవ్రశరకౌశలుఁడై యెదిరించి నిల్వ నీ
యని గతి నింకఁ జూపుచు మహాద్భుతమున్ గలిగించినట్టి, భీ
ష్ముని చరితమ్ము చాటుఁడి, యశోధనులార! జయమ్ముగాంచుడీ.

మీ వంటి వీరవంశీయులకు అసాధ్యమైన దొక్కటిగూడా లేదు.
(ధనస్సు తీసుకొని విజృంభించి బంతి తీసి) ఇదిగో మీ బంతి, దీనిని మీ వీరకేళీ విహారానికి తీసుకొని ఆడుకోండి. చిరంజీవులు గండి.

(బంతి తీసుకొని అందఱూ సమస్కరింతురు)

ద్రోణు—చిరంజీవ చిరంజీవ సుఖీభవ. శీఘ్రమే సమస్త అస్త్రశస్త్ర విద్యాపారంగతులై యశోధనులై సుఖించుడు.

[సూతుఁడు కర్ణుడు ప్రవేశం]

సూతు—మహాత్ములారా! నమస్కారములు. (నమస్కరించు)

కర్ణు—మహాత్మా! నమస్కారములు. (నమస్కరించు)

ద్రోణు—ఎవరు మీరు?

సూతు—మహాత్మా! మేము మీ దాసులము. శూద్రులము

ద్రోణు—ఆతఁ డెవరు?

సూతు—నాకుమారుఁడు

ద్రోణు—నీ కుమారుఁ డైతే, నీ పోలిక యెక్కడా కనిపించటంలేదే?

సూతు—నేను పెంచుకొంటున్న కుమారుఁడు స్వామి!

ద్రోణు—(నవ్వి) అట్లాచెప్పింకా. నీ కుమారుఁ డంటావేమిటి? వాఁడి ముఖంలో నీ శూద్రతేజస్సు కనిపించటంలేదే? అయితే, పెంపుడు కుమారు డన్నమాట. అయితే సరే.

సూతు—అవును స్వామి! ఏతల్లిగన్నదోగాని, యీ బిడ్డణ్ణి పెంచుకోవటం భారమై పెట్టెలోపెట్టి, గంగలో వదలిపెట్టిపోగా నాకు దొరికి పెంచుకొంటున్నాను.

ద్రోణు—అయితే! ఎందు కిక్కడ కొచ్చావు?

సూతు—స్వామీ! మీవంటివారి దగ్గఱ విద్యకోసం దిగడ్చి వెళ్లటాని కొచ్చాను.

ద్రోణు—ఇదివఱ కేమైనా అస్త్రవిద్యవచ్చునా ?

సూతు—ఏదో స్వామీ ! తనంతటతానే విల్లుపట్టుకొని కొంచెం సంపాదించాడు.

ద్రోణు—అయితే ! విల్లువిద్యలో కొంచెం ఆరితేరినవాఁ డన్నమాట. ఇదిగో, ఈపాదు నూతిలో బంతి పడిందికానీ, నీ పిల్లవాఁడి విల్లువిద్యతో, తీయించగలవా ?

సూతు—చిత్తం. తమరు సెలవిస్తే తెప్పపాటులో తీయించగలను.

భీము—బాబో ! చాలా గొప్ప విద్యే వుందన్నమాట.

అర్జు—గొప్పగావుందో చప్పగావుందో చూడాలి.

నకులు—ఉన్నా లేకపోయినా తీయిస్తానన్నాడు.

సహ—ఏమిటి తీసేది. ఇక్కడిదాఁకా నడిచొచ్చిన కాళ్ళుతీపుతీసేది.

దుశ్శా—అయినా, ఏమాత్రం ఘటికుడో చూస్తే మంచిదిగా.

దుర్యో—అవును. నిజంగా ఏపుట్టలో ఏంపాముందో ఎవరికితెలుసు ?

ధర్మ—అవునుగానీ తమ్ములారా ! గొప్పవాఁడైతే కావచ్చుగానీ, పెద్దలముందు గొప్పచెప్పకోగూడదు.

ఉ. ఎంతగుణాఢ్యుఁడైనను, మఱెంతపరాక్రమవంతుఁడైన నర
య్వెంతయు గొప్పఁజెప్పక, జవానుగ పెద్దలముఁదు నున్నచో
నెంతయొ వన్నెకెక్కి గడియించి, సమస్తజయాభిషేక ని
శ్చింతధనమ్ము; వాఁడు నివసించును శాంతినికేతనమ్ములోన్.

ద్రోణు—గురుభక్తి విశ్వాసాలు లేని మీవంటివాళ్ళకి మావిద్య యేమాత్రమూ అంటదు. గురువులేకుండా వచ్చిపడ్డవిద్యకే, యింత పట్టపగ్గాలేకుండా వున్నారు. ఇంకాగురువుచెప్పినవిద్య మీకు పట్టుపడ్డట్లైతే, మీముందు లోకాలు తెల్లవారవు.

సూతు—స్వామీ ! మాతప్పులు క్షమించాలి.

ద్రోణు—ఇహాగొప్పలుపోయి తప్పులొచ్చిపడ్డై. పదండి క్షమించేది లేదు. క్షమించేదిలేదు.

ధర్మ—స్వామీ! తమరు మాసంస్థానానికి దయచేయాలని మేమంద అమూ ప్రార్థించుచున్నాము. తమదివ్యమైన పాదసాన్నిధ్యమందు మేముశిష్యులమై మీఆశీర్వచనభాగ్యాలతో ధనుర్విద్య నేర్చుకొంటాం. మాతో దయచేయండి.

ద్రోణు—అట్లాగే! నాయనా! మీవంటి బుద్ధిమంతులకు చెప్పినవిద్య వృథాకాదు

కర్ణు—అయ్యా! పరమపూజ్యులారా!

ఉ. వెన్నమనస్సుకర్గి క్షమియించెడి బ్రాహ్మణచక్రవర్తి లే
కున్న జగమ్ముమండి, ప్రళయోద్ధతినుండును, వానినీడలో
ఎన్నిచిగిర్చి మేలిమిగనెన్నియుగమ్ములు వన్నెకెక్కెనో
కన్నులుపూడియున్న మొనగాండ్రకుఁ గన్పడవిప్పుడక్కటా.

ద్రోణు—చాల్లే కట్టిపెట్టుధోరణి గ్రుడ్డొచ్చి పిల్లనెక్కిరిస్తున్నట్లుగా వుంది.

కర్ణు—అవును. స్వామీ! నిజములన్నీ వెక్కిరింపులూ ధిక్కరింపులూ అయిపోతున్నై.

చ. కసరుచుఁ గష్టజీవులకుఁ గ్లైముపెట్టి సవారిజేసి, రా
జసమొలికించు రాక్షసులుఁ స్వామి! మహేస్థలిమూడ్చుచుండినన్
దొనగులు కానరావెచట; దోసిలియొగ్గి త్వదీయపాదముల్
పిసిగెడివారివద్దకనిపించెను దోసములేమి చిత్రమో.

భీము—ఇంక నీనీతికాస్త్రం కట్టిపెట్టి మర్యాదగా వచ్చినదారిపట్టు.

కర్ణు—(నవ్వి) స్వామీ! అనుగ్రహించాలి.

ఉ. ఈసుకుమారదేహములఁ కెక్కడనొచ్చని నాదుమాట నీ
కాసులబొజ్జపైన బడగానె, ముఖమ్ముకళావిహీనమై
మాసెను హేతువేమి ? యసమానబలాఢ్యుఁడ ! దీనికింత యా
యాసమువడ్డచో నిఁక మహాసమరస్థలినెట్లునిల్తువో.

అర్జు—అతి వినయంతోబాటు ధూర్తలక్షణంకూడా బయటపడు
తున్నది. ఒళ్ళు జాగ్రత్తగా పెట్టుకొని మాట్లాడు.

చ. ఎఱుగవు నీవు మాబలము ఈచతురబ్ధిమహీతలమ్ముపై
కఱకురిపుప్రపంచబలగర్వశిరమ్ములఁ ద్రొక్కిపట్టి ని
మ్మకరమగఁగోసివేసెదము కాకులకున్ దెగసీల్గకింక, న
త్వరముగఁ దూర్పుగాఁదిరిగి వచ్చినత్రోవను బట్టుదుర్మతీ.

కర్ణ—(నవ్వి) మహాశూరులారా ! మఱపురాని ప్రతిజ్ఞ చేశారు.

ఉ. ఏతలకాయలన్ని తమరెల్లరు కేఁపికఁగోసివేతురో
ఖ్యాతిగనేఁడు లేఁతసొరకాయలు కోసితిరయ్య మెన్నిరో
చూతురు మీపరాక్రమ యశోవిభవమ్ము; మఱింతకంటె, ధా
త్రీతలనాధులెల్ల బెదరించి జయించెడి రోజులున్నవే.

సూతు—మనం కయ్యానికొచ్చామా ? ఏమిటివీరెగరు ?

కర్ణ—మనకిటువంటివాళ్ళు నెయ్యానికి తగరు.

ద్రోణు—నీవంటి శూద్రమొహాలతో స్నేహం చేయటానికి ఇక్క
డెవ్వరూ లేరు.

కర్ణ—మావిశూద్రమొహాలైతే, స్వామీ ! మీమొహాలెటువంటివో
చెప్పకేం ?

ద్రోణు—మావిబ్రహ్మవర్చస్సుతో కళకళలాడే బ్రాహ్మణమొహాలు.

కర్ణ—ఇప్పుడు ఫెళఫెళలాడిపోతున్నవేం ?

దుర్యో—(నవ్వి) బాగా సమాధాన మిస్తున్నాడు.

దుశ్శా—(నవ్వి) బాగాపమిటి ? తగినసమాధాన మిస్తున్నాడు.

ద్రోణు—ఇఁక మీతెల్వికి చాలా సంతోషించాంగాని, తర్లండి.

కర్ణు—చిత్తం మేంర్లితే మీరుపొంగిపొర్లిపోతారా ?

ధర్మ—ఎందుకు నాయనా ! పెద్దలతో సరసాలు.

భీము—పట్టుకొన్న తిక్క వదలిపోటానికి.

కర్ణు—(నవ్వి) కాదు బెదరిపోట్వానికి.

ధర్మ—అబ్బాయ్ ! నీవెవరో ? చెబుతుంటే ముందు వినటంనేర్చు
కోవాలి.

అర్జు—కాదు. తినటంనేర్చుకోవాలి.

కర్ణు—అవునవును.

చ. తినుటకుముందు చక్కఁగ నుతించిమునుముఁ కదలించి చూచినన్
గనపడువాటినెల్ల తమనల్గురుముందు, సమాప్తిఁజేతు రిం
కను, తమబాహుశక్తికి నొకండు భళీయిలువండు, దానిలో
ఘనుఁడు వృకోదరుండు తమకంటె మహాకబళమ్ములేపెడిన్.

భీము—(పండ్లుకొఱికి) ఓరీ ! దుర్మదాంధా !

ఉ. నీమహిమమ్ము నీనిఖిలనిష్ఠురదోర్బలమై భవమ్ము ని
ర్ధామము సేయుదాఁక తలఁద్రొక్కిన త్రాచుగ లేతువింక, ఈ
భీముని దెబ్బఁగానవుర; పీపు విమానపుత్రమోతఁ బెట్టియే
డామడపోవుదాఁక నరహంతక ! దుర్మదదుష్టకారకా.

కర్ణు—(నవ్వి) నీవు తిన్నదానికెంత ఆయాసపడతావో, దానికంటే
మిక్కిలి అన్నదానికి ఆయాసపడేవాఁడివి. కాస్త తమాయించు
కొని మాట్లాడు పడితేయిప్పుడు లేవదీసేవారు లేరు.

అర్జు—ఇంతవఱకూ ఏదో పేదవాఁడవని జాలిపడ్డాం.

ఉ. మూడినదింక; నీబ్రదుకు ప్రొద్దు భయంకర పశ్చిమాబ్ధిలో
పూడుటకున్ బుడుంగుమని మున్గుటకున్ సమయమ్ము వచ్చె, నీ
గోడెవఁడాలకించుఁ డిదిగో! కులహీనుఁడ ! వాగఁబోకుమీ
మాడెడిపొట్టఁ బెట్టుకొని మాటలు ప్రేలిన కూడుపుట్టునా.

కర్ణు—ఈలోకంలో ధనమదాంధులూ, నిరంకుశరాజగర్వాంధులూ, నిర్భయంగా, నిర్దాక్షిణ్యంగా, ఱొమ్ములు విఱుచుకొని యింత బక్కచిక్కిన యీనిరుపేదవాళ్ల యెదురుఱొమ్ములమీద సర్వ స్వతంత్రవీరవిహారాలు చేస్తున్నప్పుడు వాళ్లకు కూడుపుట్టక పోయినమా, స్వాతంత్ర్యేచ్ఛకు రోషం పుట్టకపోదు. ఈఅనంత విశాలవిశ్వమానవ విప్లవహృదయాలలో వీరపౌరుషబడబాగ్ని పుట్టకుండా వుండదు. పేదవాఁడి రక్తమాంసాల్ని తోడుకొని, నవరత్నసౌధాలుకట్టుకొని పేదవాళ్ళనింత నిరసించి, హింసించి యిట్లా నిరంకుశించి వధించుకు తింటున్న యీపాపిష్టిలోకానికి కరవుకాటకాలు ఎట్లా రాకుండావుంటై ?

మ. కలవాఁడింతసువర్ణసౌధమున సౌఖ్యశ్రీ చిరంజీవియై
కులుకుల్ కుల్కుటకేమి ! వేళకు మహోత్కృద్బాధతో లేచి, యీ
బలియైపోయెడి వానిరక్తమును ద్రావన్ నేఁడు రాకున్నచో
ఇల గన్పించవటయ్య! వాఁడు పడుపాట్లింతెంతవో ధీనిధీ.

ద్రోణు—నీపనికి మాలిన ధన్మశాస్త్రాల్ని కట్టిపెట్టి మెల్లగా కాలికి బుద్ధిచెప్పు.

ధర్మ—అబ్బాయ్ ! పెద్దలకి కోపం రానీయక.

భీము—ఇంకానీకు మంచిమాటలు పనిచేయవు

అర్జ—శీఘ్రమే చుఱుగ్గా పనిచేసేవి తగిలిస్తేగాని కదలడు.

నకు—ఇంతమందిమాట పెడచెవిపెట్టి మొండిపట్టు పట్టగూడదు.

సహ—ఇహ నీతో మాకేమీ రవ్వంత పనిలేదు వెళ్ళిపో.

దుశ్శా—అదేమిటి! అవసరానికి ఎటువంటివాఁడైనా కావల్సివస్తుంది

దుర్యో—నిజం చెప్పావు అవసరంవస్తే యెవరైనాసరే కాళ్ళు పట్టక తప్పదు.

అర్జు—మాకా అవసరాలెప్పుడూ రానూరావు, వస్తే, మేమిటువంటి అధమాధముల కాళ్ళు పట్టేదిలేదు.

కర్ణు—అధమాధములెవరో, అంతకంటే, అధమాధములైన పరాధీను లెవరో చూతురుగాక.

సీ. పసిఁడిమేడలలోన పట్టుసోఫాలపై
గారాబముగఁబొర్లు ధీరులార!
కమ్మకమ్మని భోజనమ్ములు తెగమెక్కి
కొమఱచెడి సుకుమారులార!
నిగనిగలాడెడి సొగసైనవి ధరించి
జోరుగానడిచెడి శూరులార!
కష్టజీవుల బొమికలు మెట్లుగాఁగట్టి
మేరువెక్కెడి జమీందారులార!

గీ. మాయఖండ ధనఘనార్భటీ యుగయుగ
రాజసౌధసింహాసన ప్రాభవములు
తల్లక్రిందులై పోయెడి తరుణమందు
ఎవనికాళ్ళు పట్టెదరో యూహించుఁడయ్య.

ఈ బక్కచిక్కిన పేదవాళ్లే మీకు దిక్కు మొక్కయ్యే రోజులు రాక మానవు.

సూతు—ప్రతిజ్ఞలూ, బడాయిబూచాలుగాని పదపద.

దుర్యో—నాయనా! నీకుమారుని ప్రతిజ్ఞ మెచ్చతగ్గదేగాని, నొచ్చు

కొనేదికాదు. రేపు నీకుమారుని వెంటబెట్టుకొని మాసంస్థానానికి రా. మఱచిపోవద్దు వీరకుమారా! నీవు తప్పక రేపు మహాదేవిడికి రావాలి.

కర్ణు—ప్రభుకుమారా! తప్పకవస్తాం. మహాశయా వెళ్ళివస్తాం సెలవ.

దుర్యో—మంచిది సోదరా.

కర్ణు—వెళదాం పదాతంౘ్రీ. (నిష్క్రమింతురు)

దుర్యో—తమ్ముడా! దుశ్శాసనా! మనంగూడా పోదాంపద.

(నిష్క్రమింతురు)

ద్రోణు—ప్రభుకుమారులారా! చూచితిరా వీడిగర్వం. దీనికితోడు ఈ దుర్యోధనుడుకూడా మిడిసిపడుతున్నాడు. కానివ్వండి. నా అస్త్రవిద్యాధనం సర్వస్వమూ మీకు ధారబోసి మీచేత వీళ్ల గర్వాతిశయా లుడిగిస్తాను పదండి.

(అంతా నిష్క్రమింతురు)

తెరపడును

## 2వ రంగం

దుర్యోధనుడి రాజమందిరం

[దుర్యోధనుడూ, దుశ్శాసనుడు ప్రవేశింతురు]

దుశ్శా—(ధర్యోధనుడితో ప్రవేశిస్తూ) అన్నా! దుర్యోధనా! ఇంకా ఎంతకాలమిట్లా గతిలేనివాళ్ళని కూర్చోపెట్టి బలిపిస్తారు?

దుర్యో—దుశ్శాసనా! నేనుగూడా అదే ఆలోచిస్తున్నా. మనమునల వాళ్ళకి బుద్ధి బండబారిపోతున్నది.

దుశ్శా—నిజంగా మనమునలవాళ్లే పంచపాండవుల కింతగర్వం పట్టిస్తున్నది. సమస్త సామ్రాజ్యం కట్టబెట్టటానికి ఎన్ని యిచ్చి ఎట్లా తయారు చేస్తున్నారో చూడు. ఇంకా మనమిట్లా మౌనముద్రతోపడి వుండగూడదు.

దుర్యో—ఉండగూడదు. ఇంకా తమ భుజాస్ఫాలనమూ, తమ అస్త్రవిద్యావిన్యాసమూ ఎంతకాలం దాకా భూనభోంతరాళాల్ని పగలగొడుతుంటయ్యో చూద్దాం. తమలో తాము సమస్తవిద్యాపారంగతులమనీ సకలవిశ్వసౌందర్యకళాసార్వభౌములమనీ మురిసిపోతున్నారు. మిడిసి పడుతున్నారు. ఎవడితాతగాడి ముల్లె పెట్టుకొని, ఎవడితాతగాడి పంచపట్టుకొని రోజులు గడుపుకొంటున్నారో భావించుకోకుండా బడాయిలు కొడుతున్నారు. ప్రతిజ్ఞలు పడుతున్నారు ఎక్కడా గతిలేక, పనిపతిలేక, యీ సంస్థానంలోబడి బ్రతుకుతున్న మాట మఱచిపోయి, మఱవరాని కృతఘ్నులై బలిసి ఒళ్ళుమ్మలు విఱచుకొని తిరుగుతున్నారు. ఈ సమస్తవిశ్వంభరాస్థలికి చక్రవర్తులై పోదామని కులుకుతున్నారు. ఇంక వీళ్ళ నెక్కడుంచి వీళ్ళ దుర్గర్వదురాగ్రహదోర్బలాన్ని అణచిపెట్టాలో యోచించాలి. వీళ్ళ మదమాత్సర్యాలుడిగించాలి. ఇన్నాళ్ళనుంచీ, పెత్తనాలు చెలాయించి ముదివగ్గులైన భీష్మాచార్యుడూ; కృపాచార్యుడూ వీళ్ళకింత పొగరు పట్టించి, నెత్తికెక్కించి బలిపించారు. ఒళ్ళు మఱపించారు. ఎవరక్కడ?

భటుడు—(ప్రవేశించి) ప్రభూ!

దుర్యో—మా మేనమామగార్ని పిల్చుకొనిరా.

భటు—చిత్తం. (నిష్క్రమించు)

దుర్యో—ఈకార్యాలోచనకి మనశకుని గట్టివాఁడు. చక్కని తగిన సలహా యివ్వగలవాఁడు.

దుశ్శా—సిస్సందేహంగా. కర్ణుఁడుగూడా మంచి ఉపాయశాలి.

దుర్యో—ఉపాయశాలియేకాదు పరాక్రమశాలికూడా.

[శకుని ప్రవేశం]

దుర్యో—మామా! నీవు గూడా మతిపోయి తిరుగుతున్నావా?

దుశ్శా—అట్లాగేవుంది శకునిమామ తరహా.

శకుని—(కూర్చొని) ఏమిటి నాయనా?

దుర్యో—ఏమిటా! మన ముసలవాళ్ళ తరహా నీవు చూస్తున్నావుగా.

చ. మనదెన తండ్రి చచ్చిన కుమాళ్ళకు ఈ శత వృద్ధులంత యి
చ్చిన బలగర్వసంపద; వచింపుట కెవ్వని కర్విగాదు, దీ
నిని గని రాచబిడ్డఁ డవనిన్ దల యెత్తి చరించలేఁడు, సై
తునె యిటువంటి కర్మమును? ద్రుంచనిచో హితకార్యధీనిధీ.

శకుని—అవును. మన ముసలవాళ్ళు వెనకముందులు చూచుకోకుండా నడుస్తున్నారు ఎవర్ని ఎంతవరకు మద్దుసేయాలో తెల్సుకోవటం లేదు. ఈ నాఁడింత గారాబంగా తా మెవర్ని పెంచుతున్నారో వారు తిరిగి తమ కౌరవవంశనాశకులుగా తయారవుతారన్న చూపులేకుండా సంచరిస్తున్నారు. నాయనా! సుయోధనా! ఇదంతా నేను చూడటం లేదని భావించక ఎప్పటికప్పుడు దీన్ని పడద్రోయటానికి వుపాయమేమిటో ఆలోచిస్తునేవున్నా. కుటుంబ పెత్తనం మీద వేసుకొని విఱ్ఱవీగుతున్న భీష్ముఁడికి నే నిందువల్లనే పనికిరాకపోతున్నది. ఈ కారణంచేతనే నన్ను చూచి నప్పుడల్లా కస్సుబుస్సులాడుతున్నది.

దుర్యో—మామా! నీకు వచ్చిన భయమేమీలేదు. ఈ ముసల వాళ్ళని చూచి, నీవేమాత్రం భయపడనక్కర్లేదు. వీళ్ళు పాలు పోసి పెంచుతున్న పాముల్ని మట్టు కెట్లా పెట్టమాలో కాస్త ఆలోచిస్తుండు.

ఉ. నా జనకుండు కష్టములు నష్టములోర్చి గడించినట్టి యీ
రాజ వసుంధరాస్థలికి రాజెవఁ డౌను నేఁక నేను గాక ? యీ
రోజున దిక్కులేక కడు రోష్టినబడ్డ దరిద్రులౌనె ? పృ
థ్వీ జనులెల్ల ముక్కుపయి వ్రేలిడు నట్లొనరింతుఁ జూడుమీ.

శకుని—నీకు గాక రాజ్యాధిపత్యం వీళ్ళ కెట్లా వస్తుంది ? నిజంగా ఈ పాండవేయుల్ని ముప్పు తిప్పలు పెట్టి, మూడు చెఱువుల నీళ్ళుత్రాగిస్తేగాని దిగిన మదమాత్సర్యాలన్నీ వదలిపోవు.

[కర్ణుఁడు ప్రవేశం]

దుర్యో—రమ్ము. సోదరా, కుశలమేనా ?

కర్ణు—మీదయవల్ల కుశలంగానే వున్నాం.

శకుని—ఇతఁ డెవరు ?

దుర్యో—ఇతఁడు నా స్నేహితుఁడు. మహాశూరుఁడు.

శకుని—నీ పేరేమి నాయనా ?

కర్ణు—నా పేరు కర్ణుఁడు.

దుశ్శా—పరాక్రమార్ణవుఁడు. పురుషసింహుఁడు.

దుర్యో—నిజంగా నిరంకుశపరాక్రమ సింహుఁడు.

కర్ణు—ఇదంతా స్నేహాభిమానంలెండి.

శకుని—కాదునాయనా ! నీవర్చస్సే చెబుతున్నది.

దుర్యో—మామా ! ఈసమస్త భూమండలిమీద,

ఉ. ఇతని పరాక్రమంబు మును పెవ్వరిలో కనిపించలేదు, నే
డితఁడు స్వయంకృపిన్ రణమహీతల విద్యను నేర్చినాఁడు, సం
తతము గురుప్రబోధమున ధారణచేసెడి యీ సమస్త భా
రతరణవీర కార్ముకపరాక్రమవిద్యను కట్టిపెట్టెడిన్.

కర్ణు—ప్రభుకుమారుల అభిమానగౌరవాలకు కృతజ్ఞుణ్ణి.

ఉ. వీరపయోధులై కదనవీధినిముంచెడి మీయఖండ దు
ర్వారమహాప్రతాప బడబానల కీలలముందు నేను నా
శూరతనమ్మునెంత ? పలుచోట్ల చివాట్లను పాట్లుదప్ప ఆ
ధారములేని పేదలకు ధైర్యము శౌర్యము లెక్కడుండునే ?

దుశ్శా—అట్లాఅనక. ఇంత సువర్ణసౌధాలమీద పెరుగుతున్న వాళ్ళకి ధైర్యస్థైర్యాలున్నయో, పెద్దపెద్ద వుదరాలు దిగజారుతున్నయ్యో కనపడటంలేదా ?

శకుని—బాగాచెప్పావు. ఈలంబోదరులంతా మన సంస్థానంలోనే తయారవుతున్నారు.

దుర్యో—ఈలంబోదరుఁడికి పొట్టెంత పెరుగుతున్నదో అంతకంటే వెయ్యిరెట్లు కోపంగూడా పెరిగిపోతున్నది.

కర్ణు— ఇటువంటివాళ్ళ కెంతో కోపంవుందో, అంతలో పిరికితనంగూడా వుంటుంది. (అందఱూ నవ్వేదరు)

[భీముఁడు ప్రవేశం]

భీము—(మొహాం చిట్లించుకొని) ఎందుకూ ? వేళాపాళా లేకుండా వొకటేనవ్వు.

దుర్యో—వేళాపాళాలేకుండా యేడ్వాలిగామల్లు.

శకుని—కాదుమతీ; ఈ ప్రపంచమే యేడ్పుగొట్టుప్రపంచం.

భీము—మీాముందుపడి యెవ్వరూ ఏడ్వలా.
దుశ్శా—ఏడ్చే ప్రపంచాన్ని అన్నారుగానీ, నిన్నెవ్వరిప్పుడనలా.
భీము—నిన్నెవరూ చెప్పమన్లేదు.
కర్ణు—మాటమాట్లాడితే మీాకు తప్పుకనిపిస్తుందేమండి ?
శకుని—వారెవరితమ్ము లనుకొన్నారేం ?
కర్ణు—ధర్మరాజుగారి తమ్ములు.
దుర్యో—అంచేత అన్నీ అధర్మాలే కనిపిస్తున్నై.
భీము—ఎందుకు కనిపించవు ?
దుర్యో—కనిపిస్తున్నై కనకనే, (నవ్వు)
భీము—ఎందుకింత పట్టరానిసంతోషం ? ఏంచూచుకొని యింతమిడిసి
పడటం ?
ఉ. మాకును రాజ్యమందిేక సమానపుభాగములున్న గూడ మీా
రేకరణిన్ మమున్గని సహింపకచుల్కనసేయుచుండిరో
మీాకెపుడైనతో చిన కమించఁగరాని యధర్మబుద్ధి యెం
తో కనిపించునయ్య ! ఘనదోర్బలధోశిరఁగుల్కఁబోకుఁడీ.
కర్ణు—(నవ్వి) ఇవిరాచబిడ్డల మాటలేనా ? ఉత్తమక్షాత్రవంశమూడా
మణు లిట్లాపల్క గూడదు.
ఉ. ఉత్తమరాజపుత్రులకు నొప్పదుబ్రాహ్మణ ధర్మబోధ, మీా
శత్తువనన్నగిల్లి చెయిసాచియిటుల్ ప్రణమిల్లి, యేమిటో
క్రొత్తవిపల్కినన్ సమరకోవిదులెక్కడ మెచ్చరయ్య ! యీా
మొత్తను మీాసులెత్తెడి యుభూతపరాక్రమశక్తిఁగాంచరే ?
భీము—అనవసరంగా నీవేమీామాట్లాడక.
ఉ. కూటికి గుడ్డకున్ బరులకొంపనుబట్టిన నీమొగానికిన్
ధాటిగమాటలేటికి ? సుతారపుధర్మముఁదేల్తువౌర ? పో

గాటములోఁ గనుంగొనెదరయ్యా! బలాబలముల్ మఱింక నీ
నోటికి వచ్చినట్లు తెగనూర్పిడిచేయక ధర్మపన్నముల్.

కర్ణు—ఈ నిరుపేదవాళ్ళకి సుఖాలు లేకపోయినా, రాకుమారులతో సమానమైన హోదాలు లేకపోయినా, బుద్ధిలో మట్టుకు చుఱుకుతనం బాగావుంటుంది. కేవలం పేదవాళ్ళనింత చులకనగా చూడకండి. పేదవాఁడి కష్టంలోంచే అదృష్టాలూ, భోగ భాగ్యాలూ ప్రపంచంలోకొచ్చిపడుతున్నై.

ఉ. ఈ నిరుపేదవాఁడు కడు హేయముగాఁ గనిపించెఁగాని, యీ
మానవనాథులందఱికి మాత్ర మదేమిటొ; వాని బొందిలో
మానుష వహ్నితో నుడుకు మాంసపుఖండ రుచించుచుండె, దై
వానికి తెల్లవారదిఁక వాఁడకటా బలికాని పూటకోన్.

దుర్యో—యథార్థం చెప్పావు మిత్రమా!
భీము—యథార్థాలా? శాపనార్థాలా?
దుర్యో—యథార్థాలే, ప్రతిదానికీ ఎందుకింత కోపం?

చ. ఎగిరెదవేమి చూచుకొని యీతనిపైఁ దెగకాలు ద్రువ్వి? జో
రుగ చెడుమాటలాడి కడురోతగ లేతువదేమి? యింక నీ
మగటిమి నీప్రభావము ప్రమాదములోఁ బడి పోకముందె, తి
న్నగ తలయెత్తి యీ సమరనాధుని జూడుము వాయునందనా.

భీము—మీ మాదిరి స్థానబలం చూచుకొని బడాయిలు కొట్టటం నాకు. చేతగాదు.
దుశ్శా—గుండిగలు గుండిగలు లేవగొట్టటం చేతౌతుందా?
భీము—నీవనవసరంగా మాట్లాడక.
శకుని—నీవన్నీ అవసరమైనవే మాట్లాడుతున్నావన్నమాట.
భీము—నీ కెందుకు? నిన్నెవరూ మాట్లాడమన్లేదు.
దుర్యో—నిన్నే మాట్లాడమని సెలవిచ్చారుకా మల్లు.

[అర్జునుఁడు ప్రవేశం]

అర్జు—ఏమిటి ? భీమసేనా ?

భీము—ఏమిటా ! వీళ్ళ కండకావరం.

దుర్యో—మాటలు తిన్నగా రానియ్యి.

అర్జు—మీరు తిన్నగా రానిస్తే, మిగతావాళ్ళుకూడా తిన్నగా రానిస్తారు.

దుశ్శా—మీరిప్పుడు తిన్నగా వచ్చారుగా.

భీము—ఇదిగో! దుశ్శాసనా! ఒళ్ళు జాగ్రత్తగా పెట్టుకొని మాట్లాడు. ఏమిటా వెక్కిరింపులూ వేళాకోళాలు ?

కర్ణు—ఇందులో వెక్కిరింపులేమున్నై ?

అర్జు—వెక్కిరింపులు గాదు, ధిక్కరింపులున్నై. నీవెందుకొచ్చావో నీపని చూచుకొనిపో. అంతేగాని ప్రతివీ, తలమీద వేసుకొని రాక. కాస్త ప్రభుసంస్థానంలో కాలుపెట్టావో లేదో, యింత లో అంత కళ్ళు మీదకొచ్చినవా యేం ? నీవెవఁడవు ? మేమెవ రము? తారతమ్యాల్లేకుండా మాట్లాడుతావ్ ?

ఉ. పొట్లను జేతపట్టుకొని, ముష్టికివచ్చినవాడ విట్లు, సా
మ్రాట్టులతో సమానముగఁ బ్రక్కను గూర్చుని పల్కుచుంటివా?
ఇట్టి యసహ్యచర్యగని యీబలవిక్రమసింహశౌర్య సా
మ్రాట్టు సహింపఁడోరి! యవమానముపొందనిదాఁక లేవవో?

దుర్యో—అప్రశస్తమైన వాచాశూరత్వము చాలుగాని కట్టిపెట్టు.

కర్ణు—మిత్రమా ! ఇటువంటివాళ్ళకి మనమా జడిసేది ? సమాధాన మిచ్చేది ? ఈ ప్రగల్భాలకీ, ఈ అసందర్భప్రలాపాలకీ చెవియొగ్గ గూడదు గౌరవ మివ్వగూడదు. అఖండ సంగ్రామ బల నిర్వక్ర పరాక్రమ సింహాలెవరో, నిరర్థకవాచా శూరులైన గ్రామ సింహాలెవరో కాలమే పరీక్షిస్తుంది,

చ. మలిమలమాడువాడు సుకుమారముగాఁ గనిపించకుంటచే
ఇలఁ గల వారిప్రక్కఁ దలమోఁపులు కర్షుఁడు కాకపోయె; పెఁ
విలయములేకమై పుడమి పెల్లున్నదుంచి, పసిండి మేడ మి
ద్దెలు తలక్రిందుఁ జేయు తటి దిక్కుఁక వాఁడిట గాఁకపోవునా ?

శకుని—వయస్సుకి చిన్నవాఁడవైననూ మంచినీతి చెప్పావు నాయనా!

అర్జు—నీతి చెప్పటం గాదు గోతికిఁ ద్రోయటం చెప్పాడు. అసలు నిండు కుండెప్పుడూ తొణకదు. వెల్తికుండ తొణకకుండా వుండదు.

కర్ణ—(నవ్వి) నిండుకుండ తొణకదు. వెల్తికుండమట్టుకు తొణకుతూ వుంటుంది. ఇది సరే; అయితే, యెన్నితరాలనుంచో వాచి పోయిన సామెతే గతి అయింది.

ఉ. అంత గభీరమైన ప్రళయాకృతిఁ దాల్చి, మహాసముద్రుఁ డీ
పంతముచే సదా చెవులు బ్రద్దలు కొట్టెన; వాని యందు ర
వంతయు వెల్తిలేదు, మన ప్రక్కను గుంటలు లెక్క కెన్నియో
వింతగ మిన్నకుండినను వీటికి నిండు తనమ్ము లేదుపో.

భీము—నిదానించినకొద్దీ గొంతు చించుకొంటున్నాడు.

అర్జు—ఏకవచన ప్రయోగంలోగ్గూడా దిగుతున్నాడు.

దుర్యో—(నవ్వి) ఇంకా సమాధానం చెప్పటం సన్నగిల్లింది.

దుశ్శా—అంతకంటె రొప్పటం గూడా ఎక్కువైంది.

శకుని—దమ్ములేనివాళ్ళు బాగా ఱొప్పుతారు.

భీము—ఎవరు దమ్ములేనివాళ్లో నిలిస్తే తెలుస్తుంది.

అర్జు—అమ్మో! అంతపనికి నూకు గుండెల్లేవు. దమ్ముల్లేవు.

కర్ణ—వృథా ప్రగల్భాలు అసమర్థతా శూరత్వాన్ని బయట పడేస్తై.

చ ఎవరికి గుండెలేదొ; మఱి యెవ్వరి కంతగదమ్ములేదొ, యీ
అవని జనుల్ కనుంగొన మహార్ణవ శౌర్య గభీరవీర గా
రవరణధుర్యు లొక్కొక రుండిఁక, మాటలు కట్టిపెట్టి; భూ
ధవులకుఁ బౌరుషం బొకటె ధర్మము ప్రాణములుండగా ప్రభూ.

[భీష్మద్రోణులు సభాపతి ప్రవేశం]

భీష్మ—ఏమిటా ప్రతిజ్ఞ? (అంతా లేతురు)

భీమ—ఇవి దుర్వ్యాకార దుర్వార ప్రజ్ఞా ప్రతిజ్ఞలు.

ద్రోణ—ఎవరి మీద?

భీమ—పౌరుషంగలవారి మీద.

ద్రోణ—ఎవరు వారు?

భీమ—ఇంకా ఎవరో ఏమిటి? మీ ఎదుట నిలబడ్డవారే

భీష్మ—మన సుయోధనాదులా?

భీమ—సుయోధనుఁడు గాదు. దుర్యోధనుడే ప్రాణస్నేహితుడు.

భీష్మ—వారెవరు?

ద్రోణ—ఇతఁ డండి సూతపుత్రుడు.

భీష్మ—సూతుఁ డెవఁడు?

సభా—పడవల్ని నడుపుకొంటున్న శూద్రుఁ డండి.

భీష్మ—వాఁడి కొడుకా?

సభా—పెంపుడు కొడుకట.

భీష్మ—అదేమిటి? సుయోధనా! మన రాజవంశమర్యాద మఱచి
పోతున్నావా?

మ. మన మెవ్వారమొ గాంచకుండ యిట సామాన్య ప్రజన్ జేర ని
చ్చిన సామ్రాట్టులు పల్చనై కులపురాజీవాళియున్ చిన్ననై
ఘనమర్యాదను గోలుపోదురు సుమీ; కంఠీరవం బెక్కడై
నను మార్జాలముతోడ తిర్గునటె? నాన్నా! నాదు దుర్యోధనా.

దుర్యో—తాతా! అంత నిరసించి నీచంగా చూడగూడదు.

ద్రోణు—చూస్తే వచ్చిన గౌరవహాని యేమీ లేదు.

భీష్మ—అదికాదు. సేవకావృత్తితో బ్రదికేవారిని వెంటవేసుకొని తిరగొద్దంటున్నా.

దుర్యో—మీరంతా యిట్లా హక్కులేనివాళ్ళని నా సంస్థానంలో నా రాజ్యంలో పెంచవద్దంటున్నా, పెంచదలచుకొంటే సంస్థానానికి సేవచేయించుకోండి.

భీష్మ—హక్కు లేనివాళ్ళెవరు?

దుర్యో—మాతోబాటు తేరగాతిని కూర్చున్న వాళ్లు

భీము—ఇదిగో! దుర్యోధనా! మాటలు మర్యాదగా రానియ్యి.

దుర్యో—నీవనవసరంగా మాట్లాడక నోరుమూయ్యి.

అర్జు—మూయించటానికే వచ్చింది.

దుశ్శా—(నవ్వి) అట్లా ఏమీవదరకుండా మూయించు.

భీము—(వెక్కిరించి) అదికాదోయ్ తెల్వి, మిమ్మల్ని మూయించటానికేవచ్చింది.

భీష్మ—పెద్దరగడలోకేదిగింది కథ.

ద్రోణు—ఏమోనండి మొదణ్ణుంచీ చూస్తున్నానుగదా. ఈ పాండవేయులకూ, ఈ కౌరవేయులకూ మధ్య పచ్చిగడ్డివేస్తే మండుకు పోతున్నది. విద్య నేర్పేటప్పుడుగూడా వొకళ్ళొకళ్ళిట్లా కవ్వించుకొంటునేవున్నారు.

భీష్మ—వీడెవడో మధ్యవచ్చి కయ్యాలు పెడుతున్నాడల్లేవుంది. నిన్నెవర్రా అబ్బీ పిలిచింది?

దుర్యో—నేనే పిలిచింది.

భీష్మ—ఉండవోయ్నీవు నీవు పిలిస్తేమట్టుకు పెద్దలెవర్నీ కనుక్కోకుండా వస్తుండటమేనా? అయ్యా! ద్రోణాచార్యా! ఈ సూతపుత్రుడు కూడా అస్త్రవిద్య కొస్తున్నాడాయేమిటి?

ద్రోణు—వస్తున్నాడు. వసేమట్టుకు ఈ శూద్రమొహాలకు నేర్పే దెవరు ?

కర్ణు—మహాత్మా! శూద్రులు శూరులుకాగూడదా ?

భీష్మ—అదంతా అనవసరం. మీా శూద్రమొహాలకు నేర్పగూడదు.

దుర్యో—సేవకావృత్తితో బ్రతకవలసినవాళ్లనీ, హక్కులేనివాళ్లని దెచ్చి మాతోబాటు కూర్చోబెట్టి నేర్పించటమెందుకు ?

భీష్మ—హక్కులేనివాళ్లెవరు ?

దుర్యో—పాండవులు.

భీష్మ—ఇదంతా శూద్రుడిబోధల్లేవుంది.

ద్రోణు—నిజంగా అంతే.

సభా—సందేహంలేదు. ఇది నిజంగా ఈ శూద్రుడిబోధే. అసలు వర్ణాశ్రమధర్మాల్ని మండిపెడుతున్న దూర్వాసుడొకడు. ఈ శూద్రమూకను కట్టకట్టుకొని పాపిష్టిబోధలు చేసి దేశాన్ని యిట్లా తయారుచేసుకొస్తున్నాడు.

భీష్మ—అయినే! దూర్వాసుడి తపస్సంతా యీశూద్రవంశాలకి ధార పోస్తున్నాడన్నమాట. ఈ దూర్వాసులవల్ల శూద్రులంతా శూరులౌతారా ?

సభా—దూర్వాసుడికి తోడు సూర్యుడుకూడా దొరికి, యిట్లా దైవ బ్రాహ్మణరాజభక్తి విశ్వాసాలు లేకుండా, శూద్రుల్ని తిరుగు బాటుకి లేవదీస్తున్నారు. స్వరాజ్యహక్కుదారుల్ని చేస్తున్నారు.

భీష్మ—ఈశూద్రమొహాలంతా అస్త్రవిద్య నేరుస్తే అవనీపాలకు లౌతారా?

కర్ణు—అయ్యా! మీారంతా తెలిసినవారు. శూద్రులంటే ఇంతనిరసిం చటం తగదు. ఈశూద్రుడి భుజస్కంధాలమీాదే యీసమస్త వసుంధరాచక్రం తిరుగుతున్నది. ఈబ్రాహ్మణవిద్యాదర్పమూ

ఈక్షత్రియుల నిర్వ్యాజశౌర్యవిద్యాదర్పమూ ఈశూద్రుడి శక్తి సామర్థ్యాలవల్లనే రాణిస్తున్నది.

శా. ఈశూద్రుం డొకడేకదా కరగి మీకీర్తిపూజ్యసామ్రాజ్యల క్ష్మీశోభస్కరమైన శాసనసభాసింహాసనాలిచ్చి మీ కోశాగారములన్ని నింపినది; మీగొప్పెట్లు కాపాడునో మీశూరత్వము మీప్రభుత్వమిక స్వామీ! నేను కన్పెట్టనా.

(పోబోవును)

దుర్యో—(ఆపి) కర్ణా! వెళ్ళక. నిన్ను పిల్చినది నేనుగాని వీళ్లెవరూ గాదు. వీళ్ళవల్ల నీకేగాదు, నీహితుడనైన నాకుగూడా కష్టంగానే వుంది.

భీష్మ—సుయోధనా! చాలా అవివేకంలో పడుతున్నావు.

దుర్యో—నేనుగాదు మీరు.

ద్రోణు—అట్లా అనగూడదు.

భీష్మ—అననీయండి. ఇటువంటి మనుమలవల్ల మాటపడటానికే నేను పుట్టింది. అయితే! సుయోధనా! నీఇష్టం వచ్చిన వారితో స్నేహం చెయ్యి. ఇహ నెలరోజులకు మీగురువుగారు నేర్పిన అస్త్రవిద్య పరీక్షచేస్తారు. నీవూ నీసోదరులూ పరీక్షకి సిద్ధంగండి మరి. స్వామీ! రండి. (భీష్మద్రోణ, సభాపతి, అర్జునుడు, భీముడు నిష్క్రమింతురు.)

దుర్యో—కర్ణా! ఈముసలవాళ్ళని నీవెప్పుడు లెక్కపెట్టక. రాజ్యం నాది. వీళ్ళంతా నాచెప్పుచేతల్లో మెలగి బ్రతుకుతున్నవాళ్లు. రేపు అస్త్రవిద్యాపరీక్షట విన్నావుగా.

కర్ణు—ఎన్ని పరీక్షలొచ్చిననూ మిత్రమా! ఫరవాలేదు.

ఉ. ఎంత పరీక్షవచ్చినఁ, మఱేమి భయమ్మునులేదు, ఖండఖం
డాంతరకీర్తికెక్కిడి మహారణశౌర్య సముద్రులెల్ల వి
క్రాంతవిశాల వీరశరసాహసతీవ్రదవాగ్నిచేత ది
గ్భ్రాంతిని గొల్పినన్ శిరమువంచఁడు కర్ణుఁడు ప్రాణమిత్రమా.

## ౪వ రంగం

### పరశురాముని ఆశ్రమము

కర్ణుఁడితొడమీద పరశురాముఁడు పరుండి వుండును.

[సభాపతి భీష్మద్రోణులు ప్రవేశం]

సభా—నిద్రపోతున్నారా ?

కర్ణ—అవును.

సభా—లేపవచ్చునా ?

కర్ణ—మాట్లాడకండి. ఇప్పుడేపడుకొన్నారు.

ద్రోణు—కదలుతున్నారు. నిద్రపోలేదల్లేవుంది. కొంచెం లేపుదూ !

కర్ణ—ఇప్పుడుకాదు. కాస్తఆగిరండి

సభా—వచ్చిందెవరో తెలుసునా ! భీష్మాచార్యులవారు, ద్రోణాచార్యులవారు.

కర్ణ—లేచేదెవరో తెలుసునా ! రాజమత్తేభసింహుఁడు.

సభా—బాగానేవుంది.

ద్రోణు—నీవెవరు ?

కర్ణ—ఈత్రిలోకైక వీరునిశిష్యుఁడను.

భీష్మ—మేముగూడా వారిశిష్యులమే.

కర్ణ—అయితే ఏమంటారు ?

పరశు—(నిద్రలేచి) ఎవరువీరు ?

కర్ణ—త్రిలోకైక రాజవీరులట.

పరశు—ఇంకనూ రాజవీరులున్నా రావేం ?

భీష్మ—స్వామీ ! గురుపుంగవులా ! నమస్కారములు. మీశిష్యుణ్ణి. నాపేరు భీష్ముడు. (అందఱూ నమస్కరింతురు)

పరశు—నాయనా ! భీష్మా ! మీరొచ్చి ఎంతసేపైంది ?

భీష్మ—ఇంతకుముందే స్వామీ ! వీరు మాసంస్థాన అస్త్రవిద్యాగురు పుంగవులు. ద్రోణాచార్యులువారు.

పరశు—అట్లాగా. కూర్చోండి. అయితే ఏంపనిమీదొచ్చారు ?

భీష్మ—తమదర్శనార్థం వచ్చాం. రేపు మాకురుపాండవేయుల అస్త్రవిద్యాపరీక్ష చేస్తారు. తమరు తప్పకుండా దయచేసి మమ్మల్నీ మాపిల్లలనూ, ఆశీర్వదించి, మాపూజాసత్కారములు స్వీకరించి వెళ్ళాలని ప్రార్థిస్తున్నాం.

ద్రోణు—స్వామీ ! తప్పక దయచేయాలి.

సభా—అసలు ధనుర్విద్యా గురుపుంగవులు మీరు. అంచేత తప్పక దయచేయాలని ప్రార్థిస్తున్నాం.

పరశు—అట్లాగే ! శిష్యా !

కర్ణ—స్వామీ ! (ఎదుట నిలబడును)

పరశు—వారికి ఫలరసాలిచ్చి గౌరవించుము.

కర్ణ—చిత్తం. (పోతూనిలబడును)

సభా—ఇతడెవరుస్వామీ !

పరశు—ఎవరో బ్రాహ్మణకుమారుడు. బుద్ధిమంతుడు. అస్త్ర విద్యాభ్యాసం చేస్తున్నాడు.

ద్రోణు—ఇతణ్ణెక్కడో చూచినట్లున్నాం స్వామీ !

సభా—నేనూ అదేచూస్తున్నా. ఎక్కడో చూచివున్నా.

పరశు—ఎప్పుడైనా తమ సంస్థానాలకొచ్చాడేమో. శిష్యా! ఇంకా
నిలబడే చూస్తున్నావా ?

కర్ణు—తెస్తానుస్వామీ !

ద్రోణు—తీసుకొద్దువుగాన్లే. నీపేరేమిటి ?

కర్ణు—శివప్రసాదమండి.

సభా—నిజంగా చెప్పు.

కర్ణు—అంతేనండీ.

సభా—పేరుమార్చి ఎంతకాలమైంది ?

కర్ణు—మార్చాలేదు ఏంలేదు. (నిమ్మళించు)

పరశు—అదేమిటండి ?

సభా—వీడు శివప్రసాదము గాదు, విష్ణుప్రసాదమూగాదు. వీడు
సూతపుత్రుడు. శూద్రుడు.

ద్రోణు—యథార్థంగా ఇతడు సూతపుత్రుడండి.

భీష్మ—కర్ణుడన్న మాట ఇట్లావేషం మార్చాడేమిటి ?

సభా—గురుధనం అపహరించటానికి.

ద్రోణు—నిజంగా అంతే.

పరశు—ఆరి లోకవంచక. ఎంత కపటవేషం వేసుకొచ్చావురా !

ద్రోణు—వీడికేమన్నా అస్త్రవిద్య నేర్పారా ?

పరశు—అస్త్రవిద్యనంతా నేర్పానుబాబు.

సభా—అనుకొన్నంతా అయింది. అయితే ఫరవాలేదులెండి. ఈ
కపటవేషధారుడింకా విద్యరాణించదు.

ద్రోణు—యథార్థంగా రాణించదు. రాణించగూడదు.

[ఫలములు తీసుకొని కర్ణుడు ప్రవేశం]

భీష్మ—ఇదేమిటికర్ణా ! ఇంత మాయబుచ్చావు ?

కర్ణు—ఏమీలేదులెండి. ఫలాలు తీసుకోండి. (ఇవ్వబోవు)

సభా—కపటవేషధారుల ఫలాలు మాకేమీ పనికిరావు.

ద్రోణు—నిజంగా మాకు పనికిరావు.

పరశు—మూర్ఖా! ఇంకా నీవంటి గురువంచకుల ఫలా లెవ్వరికీ పనికి రావు.

కర్ణు—స్వామీ! క్షమించండి.

పర—(కోపంతో) క్షమించేదీలేదు. శమించేదీలేదు. ఆటే మాట్లాడక.

కర్ణు—గురుపుంగవా!

చ. ఫలముల కేమిదోషము ? కృపారసపుంగవులార ! వానిలో
ఫలరసమున్ గ్రహించి, పయివచ్చిన తొక్కిక పారవేయుడీ
కులములజోలియేల ? గయికొండు ఫలాలు మహాత్ములార! ని
ష్ఫలమును జేయఁబోకుఁడి వివాదముతోడను నాదుప్రార్థనల్.

సభా—శూద్రమొహానికితోడు ధర్మబోధగూడానా?

కర్ణు—స్వామీ! ధర్మబోధ కనర్హులవటానికి శూద్రులంత అధోగతిజన్మ మెత్తలేదు.

సభా—ఎత్తకపోవటమేమిటి ? అయితే నీవుటకే తెలియని హీనస్థితిలో నీవు పడివున్నావన్నమాట. శూద్రులంటే పాదజులు. ప్రపంచ మూలవిరాట్టు పాదాల్లో పుట్టారు.

కర్ణు—అయితే ! స్వామీ ! మీవంటి మహాత్ములంతా ఎక్కడపుట్టు కొచ్చారు ?

పరశు—ఒళ్లుబలిసి మదించి మాట్లాడక. నీనాలిముచ్చు మొహానికి తోడు ప్రశ్నలు గూడానా.

సభా—అడగనీయం డదేమిటో !

కర్ణు—గురుపుంగవా! క్షమించుడు. ఇంత పవిత్రజన్మలెత్తిన బ్రాహ్మణు లంతా ఎక్కడ పుట్టుకొచ్చి పూజార్హులైనారు ?

సభా—సృష్టికర్త ముఖంలోంచి పుట్టి పూజార్హులైనారు. "బ్రాహ్మ ణోముఖమాసీత్"

కర్ణు—అయితే! స్వామీ! మాశూద్రులంతా ఆసృష్టికర్తలోంచి పుట్టుకు రాలేదా?

భీష్మ—బాగా తరిఫీదైనాడు.

ద్రోణు—బాగా ఏమిటి అన్నిటిలో పండితుడైనా.

సభా—ఇంతమాత్రానికే యిట్లా ఎగిరిపడుతున్నాడు. ఇంకా పండితు డైతే బ్రహ్మాండాల్ని మండిస్తాడు.

కర్ణు—సరేలెండి స్వామి! శూద్రుణ్ణి భగవంతుడు పుట్టించలేదా?

సభా—భగవంతుడే పుట్టించాడు. కానీ, భగవంతుని పాదాల్లో పుట్టు కొచ్చిన మొహాలు యీ శూద్రులు.

కర్ణు—అయితే! స్వామి!

గీ. శుచియు శుభ్రములేని శూద్రవాడు
పుట్టినట్టి దేవుని కాళ్లుపట్టి నేడు
దేవుని ముఖమ్ములోని భూదేవు లెల్ల
వేడుకొనుచుండి రేమిటి వెట్టిగాను?

పరశు—మూర్ఖా! గురుద్రోహీ! ఇహ కట్టిపెట్టు. ఇంత కృతఘ్నతా దోషం నీకు వృథాపోదు. ఇంకా నేను చెప్పిన విద్య కొంచె మైననూ నీకు రాణించదు. అవసరం వచ్చినప్పుడు స్ఫురించదు.

భీష్మ—ఇకనైనా బుద్ధి తెచ్చుకొని బ్రతుకు పో.

ద్రోణు—ఇటువంటి తుచ్ఛులకూ గురుద్రోహులకూ అనతికాలంలో తగిన పరాభవం గాక మానదు.

సభా—ఇప్పుడు పడ్డ పరాభవదవాగ్నిలోంచి బయటబడి బ్రతికితే చాలు, పదండి పోదాం. (అంతా నిష్క్రమింతురు)

కర్ణు—ఇంత నిరంకుశ బ్రాహ్మణ సార్వభౌములకు తోడు ఇటువంటి నిరంకుశ నిశాచర ప్రభువులంతా దొరికి ప్రజల్ని అమాయకుల్ని చేసి, అధోగతిలోపెట్టి దారుణ వధలతో మారణ కథలతో బలియిస్తున్నారు. ఈ కర్ణుడు గొంతులో ప్రాణమున్నంత వఱకూ ఇంత ఘోరకిరాతకలోకాన్ని నిర్మూలం చేస్తాడు. దుర్యోధనుడు దీనికి తోడురాగలడు. చేయమన్నది చేసితీర గలడు. మాటకారుల్ని అధికారుల్ని ప్రజాసేవకులుగా చేసి వేస్తేగాని ప్రపంచశాంతి సౌఖ్యాల్ని చూడలేం. ఇహ ఈ బ్రాహ్మణులకూ, ఈ జమీందారులకూ బెత్తెడు భూమి లేకుండా ప్రజలకి పంచిపెట్టాలి. నిరంకుశ రాక్షస ప్రభుత్వాల్ని అణచి పెట్టాలి.

ఉ. చిక్కని వీరరక్తమును జిమ్మెడి కూతురువచ్చి, గొప్ప పే
రెక్కిన కోడిపుంజులు, మఱింక తెగించి, బిగించి, నడ్మ లీ
యుక్కుకటారి కత్తులకు నూపిరి తిత్తుల నిచ్చి నప్పుడే
చక్కదనాల రాజ్యము విశాల వివేక ధనాలు చూపురా.

(నిష్క్రమించుమ తెరపడును.)

శ్రీ శ్రీ శ్రీ

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 3 | లఉంచు | లటంచు |
| 6 | 12 | మాణాన్ని | మళ్ళాన్ని |
| 6 | 13 | కావాడ | కాపాడ |
| 8 | 23 | దర్శలు | దర్శులు |
| 13 | 3 | సన్యాపి | సన్యాసి |
| 13 | 24 | తప్ప | తప్పః |
| 15 | 7 | బుచ్చి | బుచ్చు |
| 16 | 6 | దోషం | రోషం |
| 23 | 7 | పిల్లవాణ్ని | పిల్లోణ్ని |
| 24 | 20 | పెద్దవాళ్ళంతా | పెద్దోళ్ళంతా |
| 27 | 7 | ఏంటినూసుకొని | ఏంటి సూసుకొని |
| 27 | 21 | తీరుస్తాడు | తీరుత్తాడు |
| 27 | 23 | తీరుస్తాడు | తీరుత్తాడు |
| 27 | 23 | మురుస్తూ | మురుత్తూ |
| 28 | 2 | పారేస్తే | పారేత్తే |
| 28 | 2 | పోస్తా | పోత్తా |
| 28 | 8 | కొట్టొస్తాడు | కొట్టొత్తాడు |
| 28 | 12 | చంపేస్తావా | చంపేత్తావా |
| 28 | 15 | వుండాల్ | వుండావ్ |
| 28 | 18 | ఒళ్లు | ఒల్లు |
| 28 | 21 | వాగుతుంటాల్ | వాగుతుండావ్ |
| 29 | 14 | వరహాల | వరాల |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 29 | 16 | ఎక్కడివిరా | ఎక్కడియ్యారు |
| 29 | 17 | ఏవేళ్లయిందిరా | ఏయేళ్లయిందిరా |
| 29 | 17 | నీవొస్తావని చూస్తున్నా | నీవొత్తావని చూత్తున్నా |
| 30 | 9 | మీకెరవేయులు | మీకొరవేయులు |
| 31 | 7 | ల్వ | నిల్వ. |
| 32 | 2 | నేడుపెనగి | నేడుపెనగి |
| 32 | 23 | త్రీవళ | త్రీవళర |
| 35 | 4 | సాసిధ్య | సాన్నిధ్య |
| 35 | 19 | మహేస్థలి | మహీస్థలి |
| 36 | 12 | తెల్లరు | రెల్లరు |
| 37 | 8 | మేం ర్లితే | మేం తర్లితే |
| 39 | 16 | సంహాసన | సింహాసన |
| 44 | 17 | కెంతోకోపం | కెంతకోపం |
| 45 | 15 | ధోణిర | ధోరణి |
| 47 | 7 | పచ్చారుగా | వచ్చారుగా |
| 47 | 16 | పొట్లను | పొట్టను |
| 48 | 1 | మలిమల | మలమల |
| 51 | 12 | మండిపెడు | మంటపెడు |
| 52 | 16 | నేర్చిన | నేర్పిన |
| 55 | 21 | డింకా | డికింకా |

## టిప్లీదాటర్   వెల రు 1—0—0

ఈ నాటకంలో ధనికుల యిండ్లలో చనవుగా సంచరించే దాసీల దారుణచర్యలు, యాయివార బ్రాహ్మణుని దుర్దశలు, బాలవితంతువులకు మళ్ళీపెళ్ళి చెయ్యకపోతే కలిగే అగచాట్లూ కళ్ళకట్టినట్లుగా చిత్రింపబడి సంఘ దురాచారమనే మబ్బుదొంతరను విడగొట్టే జంఝూమారుతం చెల రేగించారు. తప్పక చదివి తీరవలసినది.

## క్లాసుమేట్సు   వెల రు 1—0—0

ఈ రమ్యావలోకనీయమైన నాటకంలో పెద్ద చదువులు చదివి పెద్ద జీతాలు పుచ్చుకుంటూన్న కాలేజీ ప్రొఫెసర్లు చేసే విద్దూరపు పనులు కాలేజీ ట్రస్టీల దుండగములు, మేల్ ఫీమేల్ స్టూడెంట్సు ప్రేమకలాపాలు, క్లాసు మీట్సు లయిన టూ కపుల్సు మేరేజి చేసుకోవడం, రణతత్వసార మంతా మధురరూపకంగా చిత్రింపబడ్డది.

## గర్భవతి   వెల రు 1—0—0

పుష్పవతియై యింట్లో కూర్చొని తలిదండ్రులు కుదిర్చిన వరుని బెండ్లిచేసుకొనక రహస్యముగా దా నొకనిని ప్రేమించి వానివలన గర్భము దాల్చి యతనిం దక్క వేరొక్కని నొల్లనని ప్రతినగొన్న చంద్రరేఖ యను సుందరాంగి కష్టకథ. ఇందు సిద్ధాంతిగారి శిష్యుడు వీరంభొట్లు సత్రం గుమాస్తా సంభాషణములు గిలిగింతలు గలుగజేయక మానవు. నిజముగా నిట్టి సాంఘిక నాటకరాజ మిదివర కాంధ్రభాషలో లేదు.

వలయువారు:—

**కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,**

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమంద్రి.